# సమాజ పరివర్తన

# సంఘ శాఖ



సాహిత్య నికేతన్
హైదరాబాద్.

శంకర జయంతి.
ఏప్రిల్, 1988

ప్రచురణ :
సాహిత్య నికేతన్
3-4-705/4, నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029.

ముద్రణ :
భారత ముద్రణాలయం
నారాయణగూడ,
హైదరాబాద్-29.

ప్రతులకు :
సాహిత్య నికేతన్
బర్కత్‌పురా,
హైదరాబాద్-27.

సాహిత్య నికేతన్
ఏలూరురోడ్,
విజయవాడ - 2.

వెల : రూ. 2-50

# ముందుమాట

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సర్ సంఘ్ చాలక్ దేశంలోని అన్ని ప్రాంతాలను సందర్శించి కార్యకర్తల శిబిరాలలో ప్రసంగించటం ప్రతి సంవత్సరం మామూలే. అలాగే 1987 డిసెంబరు నెలలో ఆంధ్ర ప్రాంతంలోని ప్రముఖ సంఘ కార్యకర్తల శిబిరం భాగ్యనగర్‌లో జరిగింది. అందులో పరమ పూజ్యశ్రీ బాలాసాహెబ్ దేవరస్ చేసిన ప్రధానోపన్యాసాన్ని, కార్యకర్తల ప్రశ్నలకిచ్చిన సమాధానాలను పుస్తకరూపంలో ప్రచురిస్తే బాగుంటుదని పలువురు సూచించారు.

ఆ సూచన మేరకు ఈ చిన్ని పుస్తకాన్ని 'సమాజ పరివర్తన-సంఘశాఖ' ప్రచురిస్తున్నాం. ఇందులకు సహాయపడిన అందరికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

విభవ శంకర జయంతి
వైశాఖ శు॥ పంచమి
13, ఏప్రెలు, 1988
భాగ్యనగరము

ప్రకాశకులు

చదవండి! చదివించండి!!

| | | |
|---|---|---|
| 1. | నవభారత నిర్మాణంలో ఆర్.ఎస్.ఎస్. | 2-00 |
| 2. | సాంఘిక సమానత హిందూ సంఘటన | 1-00 |
| 3. | సూక్తులు—సుభాషితములు | 1-00 |
| 4. | హిందువులెక్కడున్నారు | 2-50 |
| 5. | నేటి సమస్యలకు శాశ్వత పరిష్కారం | 2-50 |
| 6. | విశ్వకళ్యాణం—హిందూ సంఘటన | 3-00 |
| 7. | అవును! నేను ఆగ్రహించిన హిందువునే | 2-00 |
| 8. | స్మృతికణాలు | 3-00 |
| 9. | సంఘటన—సమాజ నిర్మాణం | 1-00 |
| 10. | సంఘ మంత్రద్రష్ట డాక్టర్‌జీ | 4-00 |
| 11. | గురూజీ జీవనయజ్ఞం | 4-00 |
| 12. | ఏకాత్మత—ప్రార్థన | 2-00 |
| 13. | ప్రార్థన | 2-00 |
| 14. | విజయ విపంచి | 6-00 |
| 15. | మునునూరి నాయకులు | 4-00 |
| 16. | మన ఆదర్శం | 5-00 |
| 17. | కథా కల్పతరువు | 3-00 |
| 18. | శ్రీ గురూజీ (అమరచిత్రకథ) | 3-50 |
| 19. | పాంచజన్యం | 60-00 |
| 20. | ఆర్. యస్. యస్. కథ | 15-00 |
| 21. | యువతి నా ఆశాజ్యోతి | 1-50 |
| 22. | సరయూనది గలగలలు | 5-00 |

# సమాజ పరివర్తన – సంఘ శాఖ

నేడు కాంగ్రేసు సంస్కృతి అని పిలువబడుచున్న నడవడిక సర్వ సామాన్యమై పోయింది. అందరూ అదేవిధంగా పనిచేస్తున్నారు. అదేవిధంగా తమలో తాము తగవులాడు కుంటున్నారు. అది నిజంగానే సర్వసామాన్య మైన సంస్కృతి అయిపోయింది. సామాజిక సేవా కార్యక్రమాలలో పాల్గొనే వారికి కూడ యిది సామాన్యమైన సంస్కృతి అయింది. వాళ్లు తమ తమ ప్రాంతాలకు ఢిల్లీలో కూడ తగవులాడు కుంటున్నారు. ఇతను డబ్బు తిన్నాడు. అతను డబ్బుతిన్నాడు అంటూ నిందారోపణలు చేసు కొనటం కూడ మామూలయింది. సాధారణంగా సార్వజనిక సంస్కృతిగా ఇది మారింది.

సంఘకార్యం ప్రారంభమై అరపై సంవత్సరాలపైగా అయినా ఈ విధమైన సంస్కృతి మాత్రం మనకు అంటుకోలేదు. ఇక మీదట మనకు ఆ సంస్కృతి అలవడ కూడదు. అది అలవడకూడదంటే స్వయం సేవకుల కార్యపద్ధతిలో గాని, ఆలోచనాసరళిలో గాని తప్పుడు మార్పులు రాకూడదు ఈ సంస్కృతి స్వయంసేవక్ కు అంటుకునే ప్రమాదముందా అని అప్పుడప్పుడు భయమేస్తుంది.—దీనిని సంస్కృతి అనకూడదేమో. ఆ పదం సాధారణంగా మంచి అర్థంలో వాడతారు. కాని కాంగ్రెస్ సంస్కృతి (**Congress Culture**) అనే పదబంధంలో అది చెడు అర్థంలోనే వాడ బడింది. అప్పటి నుంచీ మంచి అర్థాన్నిచ్చే పదాన్ని కూడ మరో విధంగా వాడుతున్నాం.

పత్రికలవారు సంఘంపై ఏదో వార్త ప్రచురింపవచ్చు, నేను చెప్పిన మాటలకో మరో సంఘ అధికారి చెప్పిన మాటలకో విపరీత వ్యాఖ్యానం చేయవచ్చు. ఇప్పుడే కాదు. పూర్వం కూడ అలా జరుగుతుండేది. స్వయంసేవకులు వాటిని పట్టించుకునే వారుకాదు. తమకు తోచిన రీతిలో సరియైన అర్థాన్ని గ్రహించేవారు. మనస్సులలో ఎటువంటి సందేహం ఉత్పన్నమయ్యేది కాదు. ఎందుకంటే మన కార్యపద్ధతిలో అటువంటి సందేహాలకు తావులేదు ఈనాడు ఈ విధంగా పత్రికలలో వార్తలు రావడం ఎక్కువగానే ఉంది. కొన్నిసార్లు మంచి విషయాలు. చాలాసార్లు దుర్వ్యాఖ్యానాలు. ఈ మధ్య పరిశోధనాత్మక పత్రికా రచన (**Investigative journalisam**) అని ఒకటి ప్రారంభమైంది. నన్ను కలుసుకోటానికి వచ్చిన ఓ పత్రికా విలేఖరితో హాస్యంగా నేను అన్నాను. తమ కార్యాలయంలో మేజాబల్ల వద్ద కూర్చుని తయారుచేసే రచనలు పరిశోధనాత్మకమైనవని. అలా రకరకాల రచనలు పత్రికలలో ప్రచురింపబడుతున్నాయి. అచ్చయిన వాటికి ప్రాముఖ్యం పెరుగుతోంది. అనుభవజ్ఞులైన స్వయంసేవకులు కూడ పత్రికలలో ప్రచురింపబడ్డాయి కదా అని ఆలోచిస్తున్నారు. దీనికి ఒక ఉదాహరణ చెప్తాను.

1975లో అత్యయికపరిస్థితి కాలంలో సంఘంపై నిషేధపుటుత్తర్వులు జారీ చేయబడ్డాయి. నన్ను యార్వాడ కారాగారంలో బందీ చేసారు. నాకు డయబిటిస్ వ్యాధి ఉన్నందున తరచు వైద్యపరీక్ష అవసరమయింది. మొదట్లో అధికారులు కఠినంగా ఉండేవారు కాదు. అందువలన నన్ను బొంబాయి ప్రభుత్వ వైద్యశాలకు తీసుకు వెళ్ళారు. అచ్చటి డాక్టరు నాగపూర్‌కు చెందినవాడు అయినందున నాకు పరిచయస్థుడే. నన్ను వైద్యశాలలో చేర్పించి ప్రత్యేక శ్రద్ధతో రోగపరీక్ష చేసాడు. అయితే ప్రత్యేక శ్రద్ధ చూపించినందుకు ప్రభుత్వం సంజాయిషీ అడిగింది, మొత్తంమీద

చెకప్‌కోసం ఆస్పత్రికి తరుచు వెళ్లవలసివచ్చింది. ప్రతిసారీ 25 మంది కాపలాతో వెళ్లటం వలన కొంత ఆలస్యం జరిగేది. నేను వ్యాన్ ఎక్కిన తరువాత కూడ ఆలస్యమయ్యేది. ఈ పరిస్థితులలో వైద్యశాలకు రానని చెప్తే ఒక ప్రైవేటు వైద్యశాలకు తీసుకు వెళ్తామన్నారు. డాక్టరు నన్ను కొన్ని రోజులు వైద్యశాలలోనే ఉంచమన్నాడు. అందువలన బొంబాయిలో ఉన్న సెయింట్‌జార్జి ఆస్పత్రిలో చేర్పించారు. అది ప్రభుత్వ ఆస్పత్రి. అందులో జైలునుండి వచ్చేవారి కోసం ఒక వార్డును కూడ ప్రత్యేకించారు. బొంబాయిలోని స్మగ్లర్లు బందీఅయిన వెంటనే డాక్టరు సర్టిఫికేట్ సంపాదించుకుని, ఆ ఆస్పత్రిలో చేరుతుండేవారు. అలా చాలమంది పెద్దపెద్ద స్మగ్లర్లు నాతోపాటు ఆ వైద్యశాలలో ఉన్నవాళ్లే.

యార్వాడలో ఉన్న మన స్వయంసేవకులలో ఒక విషయం చర్చకు వచ్చింది. ముఖ్యమంత్రి శంకరరావు చౌహాన్ నన్ను కలుసుకోవాలని భావించటం వలన నన్ను ఆ వైద్యశాలలో చేర్పించారన్నదే ఆ విషయం. నేను ఆ వైద్యశాలనుండి త్వరగానే తిరిగి జైలుకు వెళ్ళిపోయాను. నాకు ఆ వాతావరణం నచ్చలేదు. దానికితోడు వైద్యశాలలో ఉండవలసిన అవసరం కూడ లేదని వైద్యులు చెప్పారు. నేను జైలుకు వెళ్లగానే నన్ను కలుసుకున్న వాళ్లంతా అడిగిన ప్రశ్న శంకరరావు చౌహాన్ ఏమి మాట్లాడారని. స్వయం సేవకులు కూడ అడిగారు. ఆయనతో కలవలేదని చెప్పినా రహస్యమేమోయని భావించారు.

ఈమధ్య నవభారత్ టైమ్స్‌లో ఒక వార్త వచ్చింది. డి.పి. మిశ్రా పేరు మీరు విని ఉంటారు. దాదాపు 90 సంవత్సరాల వయస్సుంటుంది. కనపడదు. వినపడ్తుందో లేదో తెలియదు. ఆయనతో పూర్వమే పరిచయముంది. ఆయనను రజ్జూభయ్యా పిలుచుకువచ్చారు. నాగపూర్‌కు చెందిన వ్యక్తి కాబట్టి పరిచయముంది. ఆయనను కలుసుకున్న సమయంలో

అద్వానీజీ, భావూరావ్‌జీ కూడ ఉన్నారు. ఆయన చాలా (informal) మామూలుగా కలుసుకున్నారు. కానీ నవభారత్ టైమ్స్ "ఈ సమావేశం వెనుక ఏదో ఒక విషయం ఉంటుంది. రాజీవ్‌గాంధీ దూతగా మిశ్రా వచ్చి ఉంటారు" అంటూ వ్రాసింది.

విజయదశమినాడు నాగపూరులో నేను ఇచ్చిన ఉపన్యాసం గురించి యిప్పుడు బాగానే చర్చ జరుగుతోంది కదా! ఆ ఉపన్యాసాన్ని కూడ రాజీవ్‌గాంధీయే తయారు చేయించి పంపినట్లు కొన్ని పత్రికలలో వార్తలు వచ్చాయి.

వసంత్ సాఠే నాగపూరుకు చెందిన వ్యక్తి. పార్లమెంటు సభ్యుడు, కేంద్ర మంత్రి, ఆయన విద్యార్థి దశనుండి నాకు పరిచయముంది. విద్యార్థిగా ఉన్న రోజులలో సంఘానికి కూడ వచ్చాడు. కాని 1975 నుంచి ఆయనను కలవనేలేదు. కాని పత్రికలలో "ఆయన తరచు నాగపూరు వెళ్తాడు. బాలా సాహెబ్‌జీతో కలుస్తాడు. ఢిల్లీవచ్చి రాజీవ్‌గాంధీకి విషయాలు అందిస్తాడు. ఆయనద్వారా బాలాసాహెబ్‌జీ విజయదశమినాడు ఏమి మాట్లాడాలో రాజీవ్ చెప్పి ఉంటాడు" అని వచ్చింది. పత్రికా విలేఖరులు ఇలా వ్రాయటంలో ఆశ్చర్యం లేదు. కాని సంఘ స్వయం సేవకుల మనస్సులలో కూడ ఇటువంటి వార్తలకు చోటు లభిస్తోందంటేనే ఆలోచింపవలసిన విషయం. వార్తా పత్రికలలో సంఘముపై అనేక విధాలుగా వ్రాస్తున్నారు. అక్టోబరు 2 న నాగపూరులో నేను చేసిన ప్రసంగంతో ఇలా వ్రాయటం ప్రారంభ మైంది. ఆ ప్రసంగంపై ఇంకా చర్చ జరుగుతూనే ఉంది. ఆ చర్చ ముగియకుండానే జయపూరు పత్రికా విలేఖరుల సమావేశంలో నేను చెప్పిన విషయాలు చర్చనీయాంశాలు అయ్యాయి. 'డిసెంబరు 13 వ తేదీ ఢిల్లీలో బహిరంగ సమావేశంలో మాట్లాడబోతున్నాను. అది కూడ చర్చ

నీయాంశం కావచ్చు. దేశంలో నేడు సంఘానికి ఒక ప్రత్యేక స్థానముంది. అందువలన అటువంటి చర్చ జరగటం సహజమే. అటువంటి విషయాలను చదివి ఆనందాన్ని పొందవచ్చు. కాని వ్యాకుల మనస్కులమై పోవటం అనవసరం. మనమే ఆ విషయాలను చర్చించటం ప్రారంభించకూడదు. 'ఆ విధంగా మాట్లడకుండా ఉండవలసింది' అంటూ సందేహాలను లేవనెత్త కూడదు. మన సంస్థలో ఒక కార్యపద్ధతి ఉంది. కార్యకర్తల బృందంగా పనిచేస్తాం. టీమ్‌లా పనిచేస్తాం. ప్రాంత సంఘచాలక్, ప్రాంత కార్యవాహ, ప్రాంత ప్రచారక్, విభాగ్ ప్రచారక్ ఇలా కార్యకర్తలున్నారు. మనకు చెప్పదలచుకున్న విషయాలు కార్యకర్తల ద్వారా చెప్పబడ్తాయి. అయితే పత్రికలలో వచ్చిన విషయాలను మీరే చర్చించటం ప్రారంభించకూడదు. పత్రికలలో వచ్చిన విషయాలవలన సందేహమనస్కులము కావడం అనుచితం. మన యొక్క విశిష్టమైన కార్యపద్ధతిలో పని చేసుకుంటూ పోవాలి.

సంఘ కార్యం ప్రారంభమై అరవై సంవత్సరాలు పూర్తయ్యాయి. ఓ సంస్థ జీవితంలో అరవై సంవత్సరాలకాలం గణనీయమైనదే. కాని దేశ చరిత్రలో అరవై సంవత్సరాల కాలమంటే అంతఎక్కువేమీకాదు. మన దేశం అతి ప్రాచీనమైంది. విశాలమైంది. జనాభాకూడ ఎక్కువే. వివిధత మన ప్రత్యేకత అని చెప్తుంటాం. భిన్నత్వంలో ఏకత్వం అనే వాక్యాన్ని కూడ ఉపయోగిస్తుంటాం. **Unity in diversity** అని ఆంగ్లంలో చెప్తాం. ఈనాడు మన వివిధత - భిన్నత్వం - పెరిగిపోతోంది. ఏకాత్మతను సాధించటం రానురాను కష్టమౌతోంది. దేశం బయటా, లోపలా అనేక శక్తులు మనలోభిన్నత్వాన్ని పెంచటానికి ప్రయత్నం చేస్తున్నాయి. ఈ దేశం శక్తివంతంగా ఉండటం వాటికిష్టంలేదు. అంతేకాదు హిందువులు బలహీనులవటమే ఆశక్తులు కోరుకునేది. హిందువులబలహీనతే దేశం బలహీనత అని వారికి తెలియటమే అందుకు కారణం.

ఈదేశంలోని సామాజిక సమస్యలు నిన్నా మొన్నా మొదలయినవి కావు. అస్పృశ్యత, వర్ణవ్యవస్థ, కులతత్వం గురించి ఆలోచించాలంటే ఎన్నివేల సంవత్సరాల చరిత్రను పరిశీలించాలి ? ఆహార, వివాహ వ్యవహారాలు ఆగిపోయాయి అంటే ఎన్నివేల సంవత్సరాలు వెనక్కు వెళ్ళి ఆలోచించాలి ? రకరకాల సామాజిక దోషాలు ఇక్కడ తయారవ్వటమే హాస్యాస్పదమైన విషయం. కొన్ని విషయాలు అసలు నిజమేనా అనిపిస్తుంది. కేరళలో మోప్లాల చరిత్ర. "వారు మొదట్లో హిందువులే అయితే వారిని ముస్లిములుగా మనమే మార్చా"మని చెప్తుంది. ఎందువలన? విదేశీయాత్రలను ఎందువలననో మనవారు నిషేధించారు. ఈ నిషేధం అసలు ఎందువలన ప్రారంభమైంది అనే అంశంపై పరిశోధన జరగాలి. వేల సంవత్సరాల పూర్వమే మనవారు చిన్నచిన్న నావలలో కూర్చుని వ్యాపార నిమిత్తం లేదా సాంస్కృతిక విస్తరణకై లేదా ధర్మ ప్రచారానికై జపాను, మంగోలియా, చైనా ,ఇండోచైనా, ఇండోనేషియా మొదలైన దేశాలు వెళ్ళారు. అందుకు సాక్ష్యాలు ఇప్పటికీ లభ్యమవుతూనే ఉన్నాయి. ఉట్టి కాకమ్మ కబుర్లుగా చెప్పుకోవటంకాదు. ఆయాదేశాల సంస్కృతిపై మన ప్రభావం నేటికీ కనపడ్తూనేఉంది. కొన్నివేల సంవత్సరాల పూర్వం ఏదేశం నుండి ప్రజలు చిన్నచిన్న నావలలో వేలమైళ్ళు ప్రయాణంచేసి తమ సంస్కృతీ సంప్రదాయాలను విస్తరింపజేసారో అదేశప్రజలే విదేశీయాత్రలను నిషేధించటం. ఎలా ప్రారంభమైందో? కాని దుష్పరిణామం కేరళలో వ్యక్తమైంది. విదేశాలకు ఎవరినైనా పంపవలసిన అవసరం కలిగితే వారిని ముస్లిములుగా మార్చిపంపటం జరిగింది. ఇంతకంటె హాస్యాస్పదమైన ప్రవర్తన ఉంటుందా ? ఇలా మనదేశ సామాజిక స్థితిగతులలో అసంగతమైన విషయాలు చోటుచేసుకున్నాయి. ఇటువంటి సమాజంలో పనిచేయటం సామాన్యమైన విషయంకాదు. చాలా కష్టం. ఏసమస్య ఎక్కడ ఎందువలన ఉత్పన్నమయిందీ చెప్పటంకష్టం. ఇప్పుడు మీరు మరచిపోయి ఉండవచ్చు

కాని ప్రత్యేక తెలంగాణ కోరుతూ జరిగిన ఉద్యమం ఎంత తీవ్రంగా జరిగింది. కళాశాలలు, పాఠశాలలు మూతబడిపోయాయి. లాఠీచార్జిలు, ఫైరింగ్ జరిగాయి.కొందరు చనిపోయారు.అంటే సమస్యలు రకరకాల కారణాలవలన ఉత్పన్నమవుతున్నాయి. సమాజ పరిస్థితుల స్వాభావికత కారణంగా, రాజకీయాల కారణంగా ఆ సమస్యలు వస్తున్నాయి. అటువంటప్పుడు వెంటనే సమస్యలను పరిష్కరించాలంటే ఎలా? వెంటనే సమస్యలను పరిష్కరించే మార్గం కానీ యుక్తి కానీ ఏదైనా అసలు ఉందా? అలా వెంటనే పరిష్కరించాలంటూ కలలు కనటం వలన ప్రయోజనముందా? దేశ పరిస్థితులను, సమస్యల తీవ్రతను దృష్టిలో ఉంచుకుని మనకార్యక్రమం గురించి ఆలోచించుకోవాలి.

దేశంలో నేడు మనప్రభావం తక్కువగా ఉందా? మనపని ప్రభావ శూన్యంగా ఉందా ? అయితే ఎంత ప్రభావంఉండాలని మనం కోరుకుంటున్నామో అంతలేదు.

హిందూ జాగరణ నేడు మనం చూస్తున్నాం. మనకు అనుభవాని కొస్తున్న విషయమది. ఆ పత్రికల వారుకూడ ఏదో విధంగా తప్పనో ఒప్పనో హిందూ జాగరణ గురించి వ్రాస్తున్నారు. అందరూ హిందూ జాగరణ అనే వాస్తవికతను గ్రహించారు. అయితే గత అరవై సంవత్సరాలుగా ఈ దేశంలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ లేనట్లయితే ఈ ప్రభావం ఏర్పడేదా? హిందువుల గురించి మాట్లాడే వారుండేవారా? నేడు దేశంలో హిందువు సమస్యల గురించి ఆలోచిస్తున్నాడు. సంఘటితమై సమస్యల నెదుర్కోవాలను కుంటున్నాడు. దేశంలో ఈ పరిస్థితి నేడు నిర్మాణమై యుంది. సామాజిక దోషాల గురించీ వాటినిర్మూలన గురించీ ఆలోచిస్తున్నాడు. పాతతరం సాంఘిక సంస్కర్తలు భిన్నప్రాంతాలలో

ఈ దోషాల నిర్మూలనకై కృషిచేసారు. సామాజిక దోషాలగురించి వ్రాసారు. ఉద్యమాలను నిర్వహించారు. చాలా విధాలుగా కృషిచేసారు. అయితే సామాజిక దోషాల తీవ్రతను తగ్గించటానికి ప్రత్నించారు. మనం చేసిన కృషిమాత్రం తక్కువైనదా?

సంఘశాఖలకు వచ్చేస్వయం సేవకులు ఒకే తతిలో నిలబడ్తున్నారు. చూడటానికి శాఖ చాలాచిన్న విషయం అనిపించవచ్చు. కాని సంఘశాఖలో ఒకే తతిలో నిలబడే టప్పుడు కులం గురించిగాని, చదువు గురించిగాని, ఆస్తి పాస్తుల గురించి గాని, ఎవరూ పట్టించుకోరు. సంఘ శిబిరాలలో ఒకే చోట ఉంటారు. కలసి భోజనాలు చేస్తారు కలసి స్నానపానాదులు చేస్తారు, కలసి నిద్రపోతారు. అయినా ఎవరెవరు ఏ కులానికి చెందినవారు అని ఆలోచించరు. ఈ ప్రవర్తన స్వయంసేవక్ జీవితంలోని ఇతర సమయాల్లో కూడ రానురాను కనపడుతుంది. సామాజిక జీవనంపై కూడ ప్రభావం పడుతుంది. ఇంత కంటె ఎక్కువ ప్రభావముంటె బాగుండునని పించవచ్చు. కాని యిప్పుడు కూడ తక్కువ ప్రభాముందా ఏమిటి? సమాజంలోని మిగతా సంస్థలలో అస్పృశ్యతా నివారణ సప్తాహోత్సవాలు చేస్తుండవచ్చు. ఆ వారంరోజులు అస్పృశ్యతను నివారించుటకై సామూహిక సహపంక్తి భోజనాలు నిర్వహించబడవచ్చు. కాని సంఘ్‌లో అస్పృశ్యతా నివారణకై నిత్య ప్రయత్నం జరుగుతూనే ఉంటుంది. శాఖా కార్యక్రమాలు, శిబిరాలు అన్నీ అటువంటి ప్రయత్నాలే. వీటిప్రభావం గృహంమీద కూడ ఉంటుంది. మనకు తెలియకుండానే సమాజం మీద తప్పనిసరిగా మన ప్రభావంఉంది ఉదాహరణకు మాకుటుంబ విషయమే తీసుకుందాం.

నేను బ్రాహ్మణుణ్ని. మా తల్లిదండ్రులు ఆచార పరులు. ఆ రోజు లలో సంఘకార్యాలయాలు లేవు. ఒకవేళ ఉన్నా ఓ చిన్నగది మాత్రమే

ఉండేది. భోజన వ్యవస్థ అసలు ఉండేది కాదు. నాగపూరు కార్యాలయం 1945-46 ప్రాంతంలో నిర్మించబడింది. ఆ తరువాతే భోజన వ్యవస్థ ప్రారంభం. ఆ రోజుల్లో పొరుగూరి నుండి స్వయం సేవకులెవరైనా నాగపూరు వస్తే వారు డాక్టర్ హెడ్గేవర్ గృహానికి వెళ్ళేవారు. డాక్టర్జీ యింట్లో పేదరికంవలన రోజుకు రెండుసార్లు వారికి భోజనం దొరకటం కూడ కష్టమయ్యేది. అందువలన కొంచెం వసతి ఉండే స్వయంసేవకుల గృహాలకు వారిని తీసుకు వెళ్ళేవారు. అటువంటి యిళ్ళల్లో మాది ఒకటి. మా అమ్మగారికి యితరులకు భోజనం పెట్టటం ఇష్టమే. డాక్టర్జీకి కూడ ఆ విషయం తెలుసు. అందువలన మా యింటికి తరచుగా స్వయం సేవకులను పంపించేవారు. మా అమ్మగారు భోజనం పెట్టేవారు కాని ఆ వచ్చిన వారి కులం ఏదో అని అనుమానం వచ్చినప్పుడు నా కంచం (ప్లేటు) వేరుగా వారి కంచాలు వేరుగా ఉంచేది. నేను ఆ విషయం గ్రహించగానే మా అమ్మగారితో ఇలా చెప్పాను.

"ఇతరులకు ఆతిథ్యమిచ్చే స్వభావం నీది. ఈ విషయం డాక్టర్జీకి కూడ తెలుసు. అందువలననే మనింటికి అతిథులను పంపిస్తున్నారు. కాని నీవు వారికి నాకు విడివిడిగా పెడ్తే, ఇక మీదట మనింటికి వారిని తీసుకు రాను". ఒకేసారి నేను ఇలా మాట్లాడవలసి వచ్చింది. మళ్ళి ఎప్పుడూ నాకు ఆ అవకాశమే రాలేదు. ఒక్కొక్కసారి రాత్రి ప్రొద్దుపోయిన తరువాత స్వయం సేవకులను భోజనాలనికి తీసుకు వచ్చే వాడిని. పనిమనిషి ఆ సమయానికి తన ఇంటికి వెళ్ళిపోయేది. అప్పుడు భోజనానంతరం మా అమ్మగారే కంచాలు కడిగేవారు. ఇది మా యింటి విషయం. ఇదేవిధంగా ఎందరో స్వయంసేవకుల ఇళ్ళల్లో స్వాభావికంగా మార్పు వచ్చింది. లెక్కపెట్టి చెప్పటం కష్టం. సంఘ స్వయం సేవకుల గృహాలలో కులాంతర, అంతర ప్రాంతీయ వివాహాలు ఎన్నో జరిగాయి. లెక్కపెట్టితే,

అభ్యుదయ వాదులం అని చెప్పుకునే వారి యిళ్ళల్లో కంటె ఎక్కువగా కులాంతర, అంతర ప్రాంతీయ వివాహాలు స్వయం సేవకుల గృహాలలోనే జరిగాయని అంగీకరించక తప్పదు.

భారతీయ శిక్షణ్ మండల్ యొక్క ప్రముఖ కార్యకర్తలలో ముకుందరావ్ కులకర్ణి ఒకరు. ఆయన కుమార్తె వివాహం కులాంతరమే సుధీర్ ఫడ్కే మహారాష్ట్రంలో గొప్ప సంగీత విద్వాంసులు. ఆయన కుమారుని వివాహం కులాంతరమే కాదు. మరో ప్రాంతానికి చెందిన బాలికను వివాహం చేసుకున్నాడతడు.

మరో సంఘటన హమీద్‌దల్వాయి మహారాష్ట్ర ప్రాంతానికి చెందిన మహ్మదీయుడు. తన మతానుయాయుల ఆచార వ్యవహారాలలోని దోషాలను విమర్శించేవాడు. వాటికి వ్యతిరేకంగా పోరాడాడు. నలుగురు స్త్రీలను వివాహ మాడటం, విడాకులు చాలా తేలికగా ఇవ్వటం ఆయనకు నచ్చని విషయాలు. వాటికి వ్యతిరేకంగా పోరాడాడు. ఆయన ఇప్పుడు లేడు. ఆయన కొక కుమార్తె ఉంది. తన కుమార్తె హిందూ యువకుని వివాహ మాడితే బాగుంటుందని ఆయన ఆఖరి కోరిక. ఆయన కుమార్తె, భార్య కూడ అలాగే భావించారు. హమీద్ దల్వాయి సోషలిస్టు. కాని ఒక్క సోషలిస్టు కూడ ఆయన కుమార్తెను వివాహమాడటానికి ముందుకు రాలేదు. కాని చౌహాన్ అనే పేరుగల సంఘ స్వయం సేవక్ ఆమెను వివాహ మాడాడు. వివాహమంటపంలో సోషలిస్టులు, స్వయం సేవకులు అందరూ ఉన్నారు. ''మనం సంఘ స్వయం సేవకులను విమర్శిస్తుంటాం. కాని వాళ్ళే అభ్యుదయ పంథాలనవలంభిస్తున్నారు. సమాజంలో మార్పును తెస్తున్నారు'' అని సోషలిస్టులనుకున్నారు. సమాజంలో మన కారణంగా మార్పువస్తోంది. అయితే ఆ మార్పు ఇంకా ఎక్కువగా ఉండాలని మనం భావిస్తున్నాం.

మనం ఈ దిశలోనే పయనించాలన్న విషయం స్పష్టమే. మనం ఆ దిశలోనే ఇంతవరకు పయనిస్తున్నాం కూడ. క్రైస్తవ మిషనరీలు విదేశాలనుండి వస్తున్నారని మనం బాధపడుతున్నాం. ఆరు, ఏడు వందల మిషనరీలు వస్తే అరవై కోట్ల హిందువులమున్నాం కదా ! మనమేమి చేస్తున్నాం. కుష్ఠురోగులకోసం వైద్యశాలలను వాళ్ళు నిర్వహిస్తున్నారు. ఆ రోగులను క్రైస్తవులుగా మారుస్తున్నారు. మనం వైద్యశాలలు ఎందుకు నిర్వహించకూడదు. ఊరికే అరిచి ప్రయోజనమేమిటి? మతాంతరీకరణ జరుగుతోంది, ఇలా చేస్తున్నారు అలా చేస్తున్నారు అని కేవలం మాట్లాడి ప్రయోజనం లేదు. గోలతోపాటు సేవ కూడ చెయ్యాలి. ఇంగ్లాండు నుంచి, జర్మనీ నుంచి, అమెరికా నుంచి ఇంతదూరం వచ్చి వనవాసీ క్షేత్రంలో డాక్టరుగా పనిచేస్తున్నారు. మన డాక్టర్లు తమ ఊరు, తమ వీధిలోనే ఉండాలనుకుంటారు. మనకు అంతకు మించిన ఆలోచన ఉండదు. అచ్చటి వాళ్ళు ఇన్ని వేల మైళ్ళ దూరం వచ్చి, వైద్యులుగా అధ్యాపకులుగా ఎలా పనిచేయగలుగుతున్నారు ? వివేకానంద కేంద్ర అధ్వర్యంలో అరుణాచల్ ప్రదేశ్‌లో మనం ఇరవై పాఠశాలలను నిర్వహిస్తున్నాం. ఆ ఇరవై పాఠశాలలకు తగినంత మంది అధ్యాపకులు నియమితంగా పనిచేసే వాళ్ళు మనకు దొరకటం కష్టమౌతోంది. జీవన వ్రతులు (పూర్ణ సమయ కార్యకర్తలు) వెళ్తున్నారు. కాని మిగతా అధ్యాపకులు అక్కడ జీవితం గడపటానికి ఇష్టపడడం లేదు. వర్షపాతం అక్కడ ఎక్కువ. అంతా అడవి క్రూర జంతువులు, పాములు ఉంటాయి. పాఠశాలనుండి దగ్గర పట్టణానికి వెళ్ళాలంటే అయిదారు మైళ్ళు నడవాలి ఆ తరువాత బస్సు ఎక్కాలి. ఇలా కష్టమయమైన జీవనం గడపటం ఇష్టం లేక రెండు మూడు సంవత్సరాలుండి వెనక్కు వచ్చేస్తున్నారు. మనదేశంలో ఉన్న 60 కోట్ల హిందువులు అటువంటి వారే అయితే సమస్యలు ఎలా పరిష్కరింపబడతాయి. ప్రభుత్వం కూడ ఇటువంటి వ్యక్తుల సముదాయమే. అందువలన దోషం

ప్రభుత్వంపై వేసి ప్రయోజనమేమి? సామాజిక జీవనంలో మార్పురావాలి. సామాన్య మానవుని స్థితిగతులు మెరుగవ్వాలి. అయితే మనం ఏమి చెయ్యకుండా తెలుగుదేశాన్ని, కాంగ్రెస్‌ను నిందిస్తూ కూర్చుంటే సరిపో తుందా? సమాజంలో కొద్దిమార్పు తీసుకొచ్చాం అది సరిపోదు. యావత్ ప్రపంచం గుర్తించే విధంగా మార్పు రావాలి. ప్రపంచంలో శ్రద్ధా నైపుణ్యంతో పనులు చేసే వారుగా మన ప్రజలకు గుర్తింపే లేదు. 'ఎయిర్ యిండియా' విమాన సంస్థకు ప్రపంచ విమాన సంస్థలలో పదవ స్థాన ముందట. ఇది ఆనందదాయకము, శోభస్కరం అయిన స్థితికాదు. ఇందులో మార్పు రావాలి. ఆ మార్పును మనమే తీసుకు రావాలి.

'హిందూ సంఘటన' అనే పదబంధానికి (phrase) పరిమితమైన (సీమితమైన) అర్థాన్ని మాత్రం తీసుకోకూడదు. అప్పుడప్పుడు మనం అలా పరిమితమైన అర్థంలోనే వాడ్తున్నాం. "ముస్లింలు హిందువులపై దాడి చేస్తే పూర్వం హిందువులు పారిపోయేవారు. ఇప్పుడు పారిపోవటం లేదు. ఎదురు తిరుగుతున్నారు. దాడిని త్రిప్పికొడ్తున్నారు. ఇది చాల మంచి విషయం. ఎందుకంటే ఇప్పుడు హింధువులపట్ల ఇతరులు సక్రమ దృష్టిని అలవరచుకుంటారు. అలాలేని యెడల హిందువు కోపానికి గురవుతాం అనే విషయాన్ని గ్రహిస్తాడు. 'ఇచ్చేవాడు పుచ్చుకోవాలి" అనే సామెత యొక్క అర్థాన్ని గ్రహిస్తాడు." ఇలా హిందూ సంఘటన గురించి పరిమిత అర్థంలో మాట్లాడటం జరుగుతోంది. అసలు అలా జరగటం సాధారణమైన విషయంగానే పరిగణించాలి. సమాజంపై దాడి జరిగినప్పుడు సమాజం దానిని వ్యతిరేకించటం అతి సామాన్యమైన విషయం ప్రాథమికమైన విషయం. అలా జరగకపోతే విచారించాలి. సమాజం అలా స్పందించటం చూసి సంఘంపై కోపం తెచ్చుకోవటం అనవసరం.

మొన్న మధ్య ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో ఏ.జి.నూరాని వ్యాసం ఒకటి ప్రచురింపబడింది. అందులో మత కలహాలకు సంఘ బాధ్యత ఉంది. అని వ్రాసాడు. ఆ మతకలహాల విచారణ సంఘాలు ఈ విషయాన్నే చెప్పాయి అని వ్రాసాడు. ఆ తరువాత ఒక పత్రికవాళ్ళు (ధర్మయుగ్) నన్ను ఇంటర్వ్యూ చేస్తూ ఆ వ్యాసం గురించి అడిగారు. నేను వాళ్ళతో చెప్పాను ఏ. జి. నూరాని ఒక ముస్లిమ్. సర్వ సాదారణంగా ప్రతి ముస్లిము మత మౌఢ్యం కలవాడే. అందువలన అలా వ్రాసాడు. తన వ్యాసంలో ఆయన రెండు ఉదాహరణలు ఇచ్చాడు. మొదటిది తెలిచ్చేరి (కేరళ) సంఘటన. సంఘ వ్యతిరేక భావాలు కలవారిని ఆదేపనిగా ఆ విచారణా సంఘంలో సభ్యులుగా వేసారు. ఇది అందరకూ తెలిసిన విషయమే. అయినా ఆ విచారణా సంఘం తన నివేదిక చివరిలో ఇలా వ్రాసింది ఈ "కొట్లాటలలో అన్ని రాజకీయ పక్షాలకు చెందిన ముస్లిములు ఒకటైనారు. అలాగే అన్ని రాజకీయ పక్షాలకు చెందిన హిందువులు ఒకటైనారు" ఇది ఏ. జి. నూరాని చదివినట్లైతే అలా వ్రాసేవాడు కాదు. నూరాని ఇచ్చిన రెండవ ఉదాహరణ జంషెడ్‌పూర్ నివేదిక. విచారణ సమయంలో ఎవరైనా సంఘ్ పేరును ఉచ్చరించబోతే, ఎందుకయ్యా అనవసరంగా సంఘ్ పేరును తీసుకువస్తారని కమీషన్ చెప్పేది. విచారణలో సాక్ష్యమిచ్చిన 35 మందిలో 33 మంది సంఘ్ పేరునే ఉదహరించలేదు. కమీషన్ నివేదిక చివరలో ఇలా ఉంది. మతకల్లోలాన్ని ముస్లిములే ప్రారంభించారు. అయితే హిందువులు తమ మీద దాడి చేస్తారేమో అనే భయం కారణంగా ముందుగానే హిందువులపై దాడి చేసారు దానితో పాటు మరో కారణాన్ని కూడ కమీషన్ చెప్పింది. కొట్లాటలకు వారం రోజుల ముందు బాలాసాహెబ్‌జీ జంషెడ్‌పూర్ బహిరంగసభలో మట్లాడారు. ఆ సభలో ఏమి మాట్లాడింది అందరికీ తెలుసు. టేప్‌రికార్డు చేసిన ఉప

న్యాసంవ్య వింటారా అని కమీషన్‌ను అడిగితే అవసరం లేదన్నారు. పత్రిక లలో ఉపన్యాసాన్ని చదివాం అందులో ఏమీలేదని కూడ కమీషన్ చెప్పింది. కాని రిపోర్టు తయారుచేసే చివరి క్షణంలో అప్పటి ముఖ్యమంత్రి జగన్నాథ్ మిశ్రా కమీషన్‌ను తమ యింటికి పిలిపించి, అక్కడే టైప్ చేయించారు. అందువలన ఆర్. యస్. యస్. పేరు సంబంధం లేకుండానే అందులోకి వచ్చింది. ఆ తరువాత నివేదిక చదివిన వారు దానిని విమర్శించారు. స్టేట్‌మన్ పత్రికలో వ్రాసే సహాయి ఈ నివేదికను తూర్పారబట్టాడు. దురద్దేశ పూర్వకంగా ఆర్. యస్. యస్. పేరు అందులో చేర్చబడింది అన్నాడు; దిస్ ఈజ్ నాన్‌సెన్స్ అని వ్రాసాడు. సాక్ష్యాలకు నివేదికకు స్వంబంధం లేదు. అని కూడ అన్నాడు. ఏది ఏమైనా హిందువు అన్యాయా నికి ఎదురు నిలుస్తున్నాడు. మన కారణంగా హిందువులో చైతన్యం వస్తోం దంటే మంచిదే. అయితే హిందూ సంఘటన అర్థం ఇంత మాత్రమే కాదు.

హిందూ సమాజంలో సమగ్రమైన పరివర్తనం హిందూ సంఘటన యొక్క వ్యాపకార్థం. ఆర్థికరంగంలో పరివర్తనం కూడ హిందూ సంఘ టనలో భాగమే. ఆర్థిక పరివర్తనం చాలా నాజూకైన విషయం. 70 కోట్ల పైగా జన సంఖ్య; కాని దారిద్ర్యం విపరీతం మనది ఏదో క్రొత్తగా ఏర్పడిన దేశం కాదు. శాస్త్రజ్ఞులు, నిపుణులు చాలా మంది ఉన్నారు. వ్యవ సాయక్షేత్రంలో మంచి పంటలు పండుతాయి. కాని ఆర్థికస్థితి బాగుండదు. స్వచ్ఛంద సేవాసంస్థ ఒకదేశ ఆర్థికస్థితిని మెరుగుపరచలేదు. ప్రభుత్వం వద్ద ధనముంటుంది కాబట్టి ప్రభుత్వమే ఆర్థిక స్థితిని మెరుగుపరచటానికి ప్రయత్నించాలి. తనవద్దనున్న ధనాన్ని సక్రమంగా వినియోగించాలి. భారీ పరిశ్రమలలో, చిన్నతరహా పరిశ్రమలలో, వృత్తి పరిశ్రమలలో, వ్యవ సాయంలో పెట్టుబడి గురించి సక్రమంగా ఆలోచించాలి. అందుకనే ఆర్థిక సమస్య నాజూకైన విషయం. నిపుణులు మాత్రమే ఆలోచించగలిగిన

విషయం. ఆర్థిక పరివర్తనం చాలా నెమ్మదిగా వస్తుంది. విశాలమైనదేశం జనాభా చాలా ఎక్కువ. జటిలమైన సమస్యలు. వాటి విషయంలో మనం సేవా కార్యక్రమం స్వీకరించగలం. వనవాసీ క్షేత్రంలో ప్రయోగాత్మకంగా కొంచెం పని చేస్తున్నాం. దానివలన ఎక్కువగా ఫలితం కూడ లభించటం లేదని చెప్పలేం. మిగిలిన సామాజిక దోషాల గురించి ఆలోచించి, వాటిని తొలగించటానికి మనం కృషి చేయవచ్చు. ఈ విషయంలో మనం ఏమి చేయాలి, ఏమి చేయకూడదు అనేది ముఖ్యం.

నిన్న ఒకరు ప్రశ్న అడిగారు. మన వారు రాజకీయ పక్షాలలో చేరుతున్నారు. ఇతర రాజకీయ నాయకులవలెనే వీరుకూడ ప్రవర్తిస్తున్నారు కదా అని అడిగారు. అలా చేసేవారు, అలా ప్రవర్తించటం అవసరమనీ, ఇతరుల సవాళ్ళు ఎదుర్కోవాలంటే తప్పదు అని అంటున్నారు. మొదట్లో అవసరమనిపించి, ఆ తరువాత అలవాటు అవుతోంది. ఆంగ్లంలో ఒక సామెత ఉంది. **You do a thing first saying that it is a necessary evil. Later it becomes less and less evil and more and more necessity.** (చేయక తప్పదంటూ తప్పులు చేయటం మొదలుపెడితే కొంతకాలానికి అది తప్పు అనే విషయము తక్కువగానూ, అవసరమనే విషయము ఎక్కువగానూ మారి తప్పు చేయటం అలవాటుగా మారే ప్రమాదముంది.) తప్పనిసరిగా చేయవలసి రావటం అలవాటు అవుతుంది. మొదట్లో చేయవలసి వస్తోంది కాబట్టి చేస్తారు. ఆ తరువాత చేస్తున్నారు కాబట్టి మళ్ళీ చేస్తారు.

బి. జె. పి. వారు అలా చేయకూడదు. సమాజంలో ఇతర క్షేత్రాలలో పని చేసేవారు కూడ ఇతరులవలె పని చేయరాదు. ఉదాహరణకు ప్రభుత్వం నుండి గ్రాంట్లు సంపాదించి, రెండు రకాల ఎకౌంట్లు వాళ్ల

వ్రాస్తుంటారు. మనం అలాగే మొదట్లో అవసరమని ప్రారంభిస్తే ఆ తరువాత అలవాటుగా మారుతుంది. సమాజంలో మనకు నమ్మకస్తులు, శీల సంపన్నులు అని పేరు. మనం ఏ పనికోసం డబ్బు వసూలు చేస్తే ఆ పని కోసమే ఆడబ్బును ఖర్చుపెడ్తామని సమాజంయొక్క నమ్మకం. ఆంధ్రలో తూఫాన్ వచ్చినప్పుడు, ప్రాథమికమైన సేవ పూర్తయిన తరువాత, ఇళ్లు కట్టి బాధితులకు ఇస్తే, బాగుంటుందనుకున్నాం. దానికి లక్షల రూపాయలు ఖర్చవుతుందనుకున్నాం. అంత డబ్బు ఎలా వస్తుందని మొదట భావించినా ప్రజలకు మనపై ఉన్న నమ్మకం కొద్దీ ధనం వచ్చింది.

ఆ రోజుల్లో నా అనుభవమొకటి చెప్తాను. విజయవాడ కార్యాలయంలో నేను కూర్చుని ఉన్నప్పుడు జరిగిన సంఘటన అది. తూఫాన్ బాధితులకు సహాయం చేయటానికి విదేశాల వారుకూడ వచ్చారు. రకరకాల దుస్తులను, వస్తువులను తూఫాన్ బాధితులకు అందివ్వటానికి వారు వచ్చేవారు. ఆ వస్తువులను ఎలా పంచిపెట్టాలో వారికి తెలియదు. అవనిగడ్డ వరకు వెళ్ళి ఏమి చేయాలో తెలియక, అక్కడ ఉన్నవారి సలహా ప్రకారం విజయవాడ సంఘ కార్యాలయంలో ఆ వస్తువులను అప్పజెప్పినట్లయితే సక్రమంగా ఉపయోగించబడ్తాయని వచ్చి కార్యాలయంలో ఆ వస్తువులను అప్పజెప్పే వారు. ప్రభుత్వోద్యోగులే చెప్పారుట తమకావస్తువులిస్తే దుర్వినియోగ మవుతాయని, సంఘ కార్యాలయంలో ఇవ్వమని. ఇవి సంఘం యొక్క పేరు ప్రతిష్ఠలు. దేశం మొత్తం మీద ఉన్న పరిస్థితి. పంజాబ్ పీడిత సహాయ నిధి విషయంలో కూడ ఇంతే "సంఘ్ కార్య కర్తలు అడుగుతున్నారు. ఈ డబ్బు సద్వినియోగ మవుతుంది అని వెంటనే ధనాన్ని ఇస్తున్నారు. మన పేరు ప్రతిష్ఠలు అలాగే కొనసాగాలి.

అంటే సంఘ్ శాఖలు అధిక సంఖ్యలో నిర్వహింపబడాలి. ఇచ్చటి నివేదికలు విన్న తరువాత ఆంధ్రలో సంఘ మితకాల్ చేస్తున్నదని

పిస్తోంది. ఎక్కువకాలం మితకాల్ చేయలేము. ముందుకు నడవక (ప్రచల్) తప్పదు. లేకపోతే పూర్తిగా ఆగిపోవాలి. పూర్తిగా ఆగిపోవటం మన మనస్సులలో లేదు. అందువలన ముందుకు వెళ్ళక తప్పదు. ఏవైనా లోటు పాట్లున్నాయంటే కారణాలు వెతికి చెప్పకండి. కారణాలు తొలగించి, ఇది వరలో పనిచేయలేదు. కష్టపడి పనిచేసాం. కారణాల గురించి ఆలోచించ లేదు. ఇప్పుడు కూడ అలసిపోయి కారణాలు వెదకుతున్నాం. మన కృషి వలన మాత్రమే పని పెరిగింది. లేకపోతే నాగపూరులో ఉన్న ఒక్క వ్యక్తి డాక్టర్జీ పనిని ఎలా పెంచగలిగేవారు? కొద్దిమంది యువమిత్రులతో డాక్టర్జీ పనిని ప్రారంభించి ఈనాడు ఒక మహత్తరమైన సంస్థగా నిర్మించ గలిగారు. నేను ఒక విషయం విన్నాను. బి.బి.సి. లో క్విజ్ కార్యక్రమంలో "ప్రపంచంలో కల్లా పెద్ద సామాజిక సాంస్కృతిక సంస్థ ఏది" అనే ప్రశ్నను అడిగారుట. దానికి అధికారికమైన సమాధానంగా రాష్ట్రీయ స్వయం సేవక సంఘ్ అని చెప్పబడింది. బి.బి.సి. లో ఈ కార్యక్రమం ఎవరైనా విన్నారో లేదో తెలియదు. శ్రీమతి ఇందిరాగాంధీ రష్యా వెళ్ళి నప్పుడు అచ్చటి రష్యా యువ సంస్థ కార్యక్రమంలో మీ దేశంలో శీల నిర్మాణం గురించి ఆలోచించే యువకుల సంస్థ ఏదైనా ఉన్నదా అని ప్రశ్నించినప్పుడు ఆర్.యస్.యస్. పేరును ఆమె సూచించటం జరిగింది. అందువలన మన కార్యకర్తలపై ప్రజలకున్న విశ్వాసాన్ని గుర్తించి,కార్య కర్తల సంఖ్యను పెంచుకోవాలి. శాఖలు పెరిగినప్పుడే కార్యకర్తలు పెరుగు తారు. సక్రమంగా జరిగే శాఖల ద్వారా కార్యకర్తలకు మంచి సంస్కారం లభిస్తుంది. మనమూ, మన కుటుంబమూ అని కాక ప్రతి వ్యక్తి సమాజం గురించి ఆలోచించాలి. సామాజిక కార్యక్రమాలన్నింటికి కావలసినది వ్యక్తులు, సాధనసంపత్తి. అయితే అన్నిటి కంటె, ముఖ్యంవ్యక్తులు. దీన దయాళ్ పురంలో, మోర్వీలో గృహనిర్మాణాన్ని చేపట్టామంటే మనకు అటు వంటి వ్యక్తులున్నారనిఅర్థం. మోర్వీ గృహసముదాయాన్ని వరదబాధితుల

కప్పగించే సమయంలో జరిగిన ఉత్సవానికి విచ్చేసిన బాబూభాయిపటేల్ మన కార్యకర్తలను ప్రశంసిస్తూ, కుళ్ళిపోయిన శవాలను కూడ నిస్సంకోచంగా నిర్భయంగా స్వయం సేవకులు తీసిపారవేసారన్నారు. శాఖలలో శవాలను తీయటంలో మనం శిక్షణ ఇవ్వటంలేదు. అనుశాసనం, సంఘటన, ధ్యేయ నిష్ఠ అనే విషయాలలో మాత్రమే మనం శిక్షణ నిస్తున్నాం. ఏ పనికైనా అవి ముఖ్యం. అందువలన ఏ పనినైనా స్వయం సేవకులు చేయగల్గుతున్నారు. ఆంగ్లంలో ఒక వాక్యం ఉంది. **It is not the gun that fights but the man behind it** అంటే తుపాకీ కాదు తుపాకీ వెనుక ఉండే మనిషి యుద్ధం చేస్తాడని, ఆ మనిషి పిరికి వాడయితే ప్రయోజనమేమిటి? అందువలన గుండె బలం కల మనుష్యులు కావాలి. శాఖలలో జరిగే పని వ్యక్తి నిర్మాణమే. హృదయమున్న వ్యక్తులను నిర్మిస్తున్నాం. అందుకనే సంఘం పని పెరగాలి. దానికోసం మీరంతా కృషి చేయాలి.

# ప. పూ. బాలాసాహెబ్ దేవరస్
## 1987 హైదరాబాద్ శిబిరం ప్రశ్నోత్తరాలు

### ఝార్‌ఖండ్ వెనుక క్రైస్తవ మిషనరీ హస్తం :

ప్ర. ఝార్‌ఖండ్ ఆందోళన వెనుక పనిచేస్తున్న దుష్ట శక్తులు ఏవి ?

స. ఆ ఆందోళన వెనుక ఉన్న దుష్ట శక్తులు క్రైస్తవ శక్తులు, అయితే హిందూ సమాజంలో దోషం లేదని చెప్పలేము. దేశంలో వనవాసీ బంధువులు కోట్ల సంఖ్యలో ఉన్నారు. హిందూ సమాజంలోని ప్రజలు శతాబ్దాల తరబడిగా వారి ప్రయోజనాలను ఉపేక్షించారు. అందువల్ల వారి జీవన ప్రమాణం దయనీయంగా ఉండిపోయింది. సమాజంలోని ఇతరులతో వారి సంబంధ బాంధవ్యాలు బాగా క్షీణించాయి. ఆ పరిస్థితిలో దేశంలోనికి ఆంగ్ల పాలన వచ్చినపుడు దానితోపాటు క్రైస్తవ మిషనరీలు కూడా వచ్చారు. ఈ మిషనరీలు వనవాసీ ప్రాంతాలలో వ్యాపించారు. ఆస్పత్రులు తెరిచారు. పాఠశాలలు నడిపారు. ఇతర సేవ కార్యక్రమాలు అనేకం చేపట్టారు. వనవాసీ ప్రజలలో పలుకుబడి సంపాదించారు. ఆ తర్వాత మతం మార్పిడులు జరిపారు. 'నీవు హిందూ సమాజంలో అంతర్భాగం కావు. ఈ దేశంలో నివసిస్తున్నప్పటికీ, నీకు ఎంతో అన్యాయం జరిగింది' అని వనవాసికి నూరిపోశారు. ఫలితంగా ఇలాంటి ఉద్యమాలు ప్రారంభమైనాయి. క్రైస్తవ మిషనరీలు ఆ ఉద్యమాలను రెచ్చగొట్టారు. వాటికి డబ్బిచ్చారు. వాటిని నిలబెట్టారు. ఇంకా ఆ పని చేస్తూనే ఉన్నారు. ఇలాంటి ఆందోళనలలో ఝార్‌ఖండ్ ఆందోళన ఒకటి మధ్యప్రదేశ్, బీహార్, ఒరిస్సాలలోని వనవాసీ ప్రాంతాలను కలిపి ఒక పెద్ద వనవాసీ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలన్నది వారి కోరిక. ప్రపంచ క్రైస్తవ మహా

సభలో వారొక కొత్త సిద్ధాంతాన్ని ప్రకటించారు. అదే లిబరేషన్ థియాలజీ. ఈ సిద్ధాంతం యొక్క అర్థం ఏమంటే-కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో వర్ధమాన దేశాలలో బలహీనవర్గాల వారిని, నిరక్షరాస్యులను, పేదలను ఆందోళన కోసం సన్నద్ధం చేయడం, వారిని విముక్తిచేసే ప్రయత్నం జరపడం కనుక అస్సాంలో కాని, బీహారులో కాని, ఒరిస్సాలో కాని, వనవాసులు హెచ్చు సంఖ్యలో ఉన్న ఇతర రాష్ట్రాలలో కాని జరుగుతున్న ఆందోళనల వెనుక క్రైస్తవుల బలమూ, ధనమూ పని చేస్తున్నాయి.

## పూజ్యశ్రీ జయేంద్ర సరస్వతి ఉద్యమం

ప్ర. కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతి ఉద్యమం ప్రకటించారు. ఇది సంఘ ఆశయాలకు దగ్గరగా ఉన్నదని మీరు భావిస్తున్నారా? సంఘం ఈ విషయమై ఏమి ఆలోచిస్తున్నది? సంఘం స్పందన ఏమిటి?

స. దానిని జరగనివ్వండి. అప్పుడు దాని విషయం ఆలోచిద్దాం. ఇప్పుడు వారు ఆ విషయమై ప్రకటన మాత్రమే చేశారు. ఆ పని ప్రారంభమయిందో లేదో నాకు తెలియదు; ముందు తెలుస్తుంది. మన పని కూడ తమిళనాడులో ఉంది. మన రామగోపాల్, సూర్యనారాయణరావు, గణేశన్, షణ్ముఖన్- వీరందరికీ స్వామివారితో మంచి పరిచయం ఉన్నది. నాకూ మంచి పరిచయం ఉన్నది. అలాంటి పని చేయబోతున్నానని వారిపుడు ప్రకటించారు. వారు తిరిగి ఆశ్రమాన్ని వదలి ఈ పనికోసం బయలుదేర వచ్చేమో అనే వార్తకూడ వచ్చింది. ఏమైనా- అది హిందువుల కార్యమే కదా. హిందువుల అభ్యున్నతికోసం వారు ఏ పనిచేసినా, అది హిందువుల ప్రయోజనాల దృష్ట్యా సముచితమైనదే అవుతుంది కనుక- అది మన పనికి సంబంధించినదే అవుతుంది. మనము కూడ ఆయన పనికి తప్పక సమర్థన ఇస్తాము. అయితే, పని సరిగ ప్రారంభం కానివ్వండి. వారుకూడ మనతో సంబంధం ఏర్పరచుకుంటారు. ఏమి చేయాలో, ఏమి చేయనక్కరలేదో

వారు మనకు చెపుతారు. సహాయంకూడ కోరతారు. ఇప్పుడు అంతా ప్రారంభ దశలోనే ఉంది. తాసీ విధంగా చేయదలచానని వారు కేవలం ప్రకటన మాత్రమే చేశారు కనుక, దాన్నిగురించి చెప్పడం కష్టం. అది ముందుముందు తెలుస్తుంది. అయినా వారితో మనకు అనుబంధం ఉన్నది. అభిప్రాయాల విషయంలో కూడ వారు అభ్యుదయ భావాలు కలవారు (Progressive). పిడివాద ఛాందసులు (Orthodox) కారు. శంకరాచార్యుల్లో కొందరు పిడివాద ఛాందసులుగా కనిపిస్తారు. వీరలాంటివారు కారు. కనుక మనకూ, వీరికీ మధ్య మంచి సమన్వయం కుదరవచ్చు. అయితే ఇది భవిష్యత్తుకు సంబంధించిన విషయం. నేడు దీన్నిగురించి ఏమీ చెప్పలేము.

## సంఘం బలపడేవరకూ సమస్యలు ఆగుతాయా?

ప్ర. సంఘ సిద్ధాంతాన్ని వివిధ జీవన రంగాలకు కొనిపోవలసి ఉంది. చాలినంత మంది కార్యకర్తలు లేనప్పుడు- ఇతర పనులు చేయవలసిందని సంఘ కార్యకర్తలను కోరడం అవసరమా? అలా చేయడంవల్ల మనం సంఘ క్షేత్రంలో కార్యకర్తలను కోల్పోతున్నాం. ఇది సముచితమా?

స. సంఘం పని చేయడానికే కార్యకర్తలు తక్కువగా ఉన్నారు. అటువంటప్పుడు మనం ఇతర క్షేత్రాలకు కార్యకర్తలను ఎందుకు పంపాలి. అని ఈయన అడుగుతున్నారు. ఒక విధంగా చూస్తే ఇది సరైన ఆలోచనే. ప్రాథమికంగా మన పని ఏమిటి? ప్రత్యక్ష సంఘ కార్యం. అది సక్రమంగా నడవడం. కాని- ఇదే సరిగా నడవడం లేదు, సరిగా నడచిన తర్వాత ఇతర రంగంలో పనిచేస్తాం- అనే నిర్ణయానికి మనం ఎలా రాగలుగుతాం? సంఘం పని చాలా జరిగింది. ఇప్పుడు కార్యకర్తలను ఇతర క్షేత్రాలకు ఇవ్వగలం అనే అంచనా ఎలా వేయగలం? ఆ నిర్ణయానికి ఎలా రాగలం? సరే అంతవరకు ఇతర రంగాలలో ఏర్పడుతూన్న సమస్యలు-వనవాసీ రంగంలో ఏర్పడుతున్న వాటివంటివి నలువైపులా ఏర్పడుతున్న సమస్యలు మనకోసం ఆగుతాయా? సంఘం బాగా బలపడేవరకు వీటిని మనం పట్టించుకొనకపోతే- ఇవి మరింత జటిలంగ తయారుకావా? ఈ సమస్యలు అలాగే ఉండిపోతాయేమిటి? ఇవి మరింత క్లిష్టం అవుతాయి.

అంతేకాదు. సంఘానికి వచ్చేవాళ్ళు అందరూ సంఘ కార్యంలో నిమగ్నం అవుతున్నారా? అంతా ప్రచారకులుగా వస్తున్నారా? అంతా శాఖ కార్యవాహక్‌లు, ముఖ్య శిక్షక్‌లు అవుతున్నారా? వారి గుణములు, అభిరుచులు, ప్రవృత్తులు వేర్వేరుగా ఉంటాయి. ఒకరికి విద్యలో అభిరుచి ఉంటుంది. మరొకరికి సేవలో అభిరుచి ఉంటుంది. వేరొకరికి పోరాట ధోరణి ఉంటుంది. హిందూ వాహిని వారివలె పోరాట ధోరణి కలిగినవారూ అవసరమే. ఆ విధంగా- కార్యకర్తలందరికీ మరే పనీ చెప్పకుండా సంఘంపనే చెప్పుదామని అనుకున్నా, అందరికీ సంఘం పనికి ఉపయోగించే గుణాలు ఉంటాయా? మన పని కూడా ఇదే- కార్యకర్తయొక్క గుణాలు ఏవో, ఏ రంగంలోకి వెళితె అతడు సత్ఫలితాలు సాధిస్తాడో ఆలోచించి ఆ విధంగా యోజన చేయడం. ఇది అవసరం. అలా కాక- సంఘం బలపడినప్పుడు, సంఘం ఇప్పుడు బలపడిందని నిర్ణయించి అప్పుడు ఏ రంగంలోకి కార్యకర్తలను పంపాలా అని ఆలోచిస్తే అంతవరకు సమాజం మనకోసం ఆగదు. సమస్యలు మనకోసం ఆగవు. అయితే ఒకటి మాత్రం అవసరం. అంచనా సరైనది కావాలి. సంఘం బాగా బలహీనంగా ఉండి, పనులు అనేకం చేపట్టితే - ఆ పనులు సక్రమంగా జరగవు. సంఘం పనీ సక్రమంగా జరగదు. సంఘానికి అక్కడ ఎంత బలం ఉన్నదో చూసి, ఆ ప్రకారం ఆయా ప్రాంతాలలో ఏ పని చేపట్టవచ్చునో, ఏ పని చేపట్ట కూడదో నిర్ణయించుకోవాలి. మనం అలాగే చేస్తున్నాం. శక్తి అంతటినీ ఒకే రంగంలో వినియోగించడం లేదు. మన ప్రయత్నం ఇదే - సంఘశాఖపై ఎక్కువ శక్తిని వినియోగించడం; ప్రత్యేకమైన గుణము, అభిరుచి గల కార్యకర్తలను ఇతర రంగాలలో వినియోగించడం. ఇలా జరగకపోతే క్రైస్తవులవల్ల, ముస్లింలవల్ల, రాజకీయ పార్టీలవల్ల, ప్రత్యేక రాష్ట్రాలు కావాలని క్రైస్తవ మిషనరీలు జరుపుతున్న ఆందోళనలవల్ల, ఇతర కారణాలవల్ల హిదూ సమాజంలో ఏర్పడుతున్న సమస్యలు మనకోసం ఆగుతాయా? కనుక - సంఘ శక్తికి అనుగుణంగా ఈ కార్యములవైపు కూడా సాధ్యమైనంతవరకు కార్యకర్తలను ఇవ్వడం అవసరం.

# సాంఘిక సమానతకోసం సంఘం కృషి

ప్ర. నేడు సమాజంలో ఈక్రింది విభేదాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి - ఉన్నవారు లేనివారు, స్త్రీలు పురుషులు, గ్రామవాసులు పట్టణవాసులు, అక్షరాస్యులు నిరక్షరాస్యులు. ఇలాంటప్పుడు - సామాజిక సమత అనేది ఏదిశలో జరిగే కృషి? దానికి ప్రాతిపదిక ఏమిటి? ఆచరణాత్మకంగా జరగవలసిన కృషి ఏమిటి ?

స. ఈ అసమానత ఒక్క హిందుస్థాన్‌లోనే ఉన్నదా - స్త్రీపురుషులమధ్య అసమానత అలాగే గ్రామవాసులకూ పట్టణవాసులకూ మధ్య ధనికులకూ పేదలకూ మధ్య మనదేశంలో ఉన్నంత సంఖ్యలో పేదలు అమెరికాలోకాని, ఇంగ్లాండ్‌లోకాని ఉండకపోవచ్చు. దారిద్ర్యరేఖను దిగువన అంతమంది ఉండకపోవచ్చు. అయినా పేదలు అక్కడా ఉంటారు. నిరుద్యోగులు అక్కడా ఉటారు. ఈ సమస్యలు భారతదేశానికి పరిమితమైనవికావు. ప్రపంచంలోని అనేక దేశాలలో ఉన్నవే. అభివృద్ధి చెందిన దేశాలలో పారిశ్రామికీకరణకు ఎంతో వ్యవధి లభించింది. ఆ దేశాలకు పెద్దపెద్ద సామ్రాజ్యాలు ఉండేవి. వారు ఆ సామ్రాజ్యాలను విస్తరింపజేశారు. సంపన్నులైనారు. అందువల్ల అక్కడి ఆలోచన అంతా ఒక ప్రత్యేక పద్ధతిలో జరిగింది - సమాజ స్థాయిలోనూ, ప్రభుత్వస్థాయిలోనూ సామాన్య వ్యక్తియొక్క స్థాయిని పెంచే ప్రయత్నం జరిగింది. పాశ్చాత్య దేశాలలో - ముఖ్యంగా పశ్చిమ యూరప్ దేశాలలో - పారిశ్రామిక విప్లవం కారణంగా, నూటికి నూరుపాళ్ళు అక్షరాస్యత ఉన్న కారణంగా సామాజిక అసమానత బాగా తగ్గింది. నాకు వాల్టర్‌స్కాట్‌వంటి పాత నవలాకారుల నవలలు చదివే ఆసక్తి ఉండేది. ఆ కాలంలో ఇంగ్లాండులో పేద ప్రజల జీవితం ఎలా ఉండేదో ఆ నవలలలో వర్ణింపబడిఉంది. విక్టోరియా మహారాణి కాలంనాటి ఇంగ్లాండుకూ, ఎలిజబెత్ మహారాణి కాలంనాటి ఇంగ్లాండుకూ ఎంత అంతరండున్నదో ఆ నవలలు చదివితే తెలుస్తుంది. ఎలిజబెత్ మహారాణి కాలంనాటి ఇంగ్లాండుయొక్క వర్ణన భారతదేశంయొక్క వర్ణనవలెనే ఉంది. పారిశ్రామిక విప్లవం, విద్యావ్యాప్తి, సమర్ధవంతమైన నాయకత్వం లభించడం - ఈ కారణాలవల్ల ఆ సమాజంలో మార్పు వచ్చింది.

ఇక మనదేశంలో అసమానత హెచ్చు అనే మాట నిజమే. ఇందుకు కారణాలు ఉన్నాయి. మన సమాజ వ్యవస్థ సరిగా లేకపోవడం ఒక కారణం. సమాజంలో సముచితమైన, సాధ్యమైన మార్పులు తేవడానికి ఎవరూ ప్రయత్నించలేదు. ఆతర్వాత ముస్లింల దురాక్రమణ జరిగింది. అందువల్ల రకరకాల సమస్యలు ఏర్పడ్డాయి. ముస్లింల పాలన సమాప్తం అయిందో లేదో - ఆంగ్లేయుల పాలన వచ్చిపడింది. ఈ దురాక్రమణ దారులు ఇద్దరికీ రాజ్యంచేయడమే ఉద్దేశం. ఇక్కడ ప్రజల ప్రయోజనాల విషయం వారికి పట్టలేదు. ఈవిధంగా వేయి సంవత్సరాలకుపైగా గడచి పోయింది. సమాజంలో ఏమి జరుగుతోందో ఎవరూ పట్టించుకోలేదు. అందు వల్ల రకరకాల సమస్యలు ఏర్పడ్డాయి.

1947 లో స్వరాజ్యం వచ్చింది. దేశం సరైన మార్గంలో నడవ వచ్చునని మనం అనుకున్నాం. మొదట్లో సరైన మార్గంలోనే కొంత ప్రయత్నం జరిగి ఉండవచ్చు. ఎందుకంటే మంచి నాయకత్వం ఉండేది. కాని, ఆతర్వాత రాజకీయాలు, అధికారం తప్ప మరేదీ పట్టని నాయకత్వం వచ్చింది. కోట్లకొలది రూపాయలు ఖర్చవుతున్నాయి. ప్రణాళికలు వేస్తు న్నారు. రాజకీయ నాయకులు భ్రష్టులు అయినందువల్ల, పరిపాలన యంత్రాంగం భ్రష్టమైనందువల్ల డబ్బు అంతా వృథా అవుతోంది. అక్టో బరులో చేసిన ప్రసంగంలో నేనీమాట చెప్పాను. దానిపై పెద్ద చర్చ జరుగుతోంది.

ఈరోజు హిందూ పత్రికలోనో, ఇండియన్ యిక్స్‌ప్రెస్ పత్రిక లోనో ఒక వ్యాసం వచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లోని షెడ్యూల్డు తరగతుల, షెడ్యూల్డు తెగల, ఇతర వెనుకబడిన తరగతుల హాస్టళ్ళలో అవినీతి విప రీతంగా జరుగుతున్నట్లు ఆ వ్యాసంలో ఉంది. రెండుమూడు సంవత్సరాల క్రితం "ఇలస్ట్రేటెడ్ వీక్లీ" పత్రికలో మరో వ్యాసం వచ్చింది. ఆ పత్రిక ప్రతినిధులు ఇద్దరు మహారాష్ట్రలోని అలాంటి హాస్టళ్ళకు వెళ్ళారు. అక్కడి స్థితిగతులు పరిశీలించలానికి వాటిని ఆశ్రమ పాఠశాలలు అని పిలుస్తారు

వారు వ్రాసిన వ్యాసం ఫొటోలతో సహా ఆ పత్రికలో వచ్చింది. ప్రభుత్వ గ్రాంట్లు ఉన్నాయి. అయినా ఆ హాస్టల్ భవనం ఎలా కట్టారంటే - అది ఇవాళో రేపో కూలిపోయేలా ఉంది. వర్షాకాలంలో కురుస్తుంది. కూర్చోడానికి స్థలం ఉండదు. గ్రాంటు ఉన్నప్పటికీ, అక్కడి పిల్లలకు రెండూపుటలా కడుపునిండా తిండి దొరకదు. వంటవాడికోసం ప్రత్యేకంగా గ్రాంటుఉంది. కాని హాస్టల్ సూపరింటెండెంట్ వంటవాడిని నియమించడు. ఆడబ్బు తానే తినేస్తాడు. పిల్లలకు తానే వంటచేస్తాడు. గ్రాంటులో తువ్వాళ్ళకు, సబ్బులకుకూడా కేటాయింపు ఉంది. కాని గడచిన రెండేళ్ళలో తువ్వాలును, సబ్బును ఆ హాస్టలు పిల్లలు చూసిఎరుగరు. ఆ వ్యాసంలో ఇదంతా వర్ణించబడింది. అసమానతలను తొలగించడానికై ప్రభుత్వం వేసే పథకాలు ఇలా అమలుజరుగుతున్నాయి.

కనుక - సరైన ప్రభుత్వం ఏర్పడనంతవరకు, సరైన పరిపాలనా యంత్రాంగం ఏర్పడనంతవరకు, సమాజంలోని ప్రజలు ఈ అన్యాయాన్ని సాగనిస్తున్నంతవరకు దీనికి వ్యతిరేకంగా నిలబడనంతవరకు ఈ అసమానత కాగితాలమీదనే కాని ఆచరణలో తొలగిపోదు. రాజకీయ యంత్రాంగం, పాలనా యంత్రాంగం, సామాన్య ప్రజానీకం - ఈ మూడు సవ్యంగా పని చేయడంలేదు. అందువల్ల - వీటిని సరిచేయడం, వీటిలో సౌశీల్యాన్ని నింపడం, వీటిపై పరిశీలన జరపడం - ఈ పని ఇతరులూ చేయాలి. మనమూ చేయాలి. ఈ దృష్టితో మనం ప్రయత్నించాలి. మీరు చెప్పింది నిజమే. సంఘం ద్వారా మనం ఆ పనిచేస్తూనే ఉన్నాం. అన్యాయం మన దృష్టికి వచ్చినపుడల్లా మనం దానికి విరుద్ధంగా నిలబడుతున్నాం.అన్యాయాలు జరుగుతున్నాయని చెపుతున్నాం. వనవాసీ ప్రాంతాలకు ప్రభుత్వ నిధులు పెద్ద యెత్తున వెళుతున్నాయి, వివిధ పద్దుల క్రింద. అయితే అవి వనవాసులకు చేరడంలేదు. వనవాసీ ప్రాంతాలలో మనం పనిచేస్తున్న స్థలాలలో ప్రభుత్వ గ్రాంట్లు అన్నీ వనవాసులకు అందేలా చూడడానికి ప్రయత్నిస్తున్నాం. సంఘం యొక్క సంపర్కం ఏర్పడిన స్థలాలలో సాధ్యమైనంత

వరకు అసమానతను తొలగించడానికే, సామాజిక సమానతను సాధించడానికే, అంటరానితనాన్ని నిర్మూలించడానికీ, కుల కక్షలను తొలగించడానికీ మనం అన్నివిధాలా ప్రయత్నిస్తున్నాం. ఈ సమస్య చాలా కఠినమైనది. చాలా పెద్దది. జనసంఖ్య కూడా హెచ్చు. అయినా ఈ పని చేయవలసిందే. అన్ని దిశలలో ప్రయత్నం జరగవలసిందే.

## పాత స్వయంసేవకులతో ఏడాదిపొడవునా సంపర్కం

ప్ర : గురుదక్షిణ లక్ష్యాలను పూర్తిచేయడంకోసం మనం సంఘం పట్ల శ్రద్ధ అంతగా లేని స్వయంసేవకుల వద్దకు పలుమారులు వెళ్ళవలసి వస్తోంది. ఈ కారణంవల్ల గురుదక్షిణ యొక్క పవిత్రత తగ్గే ఆపకాశాలు లేవా?

స : మీరు చెప్పిన కారణం సరైనదే. తన ఖర్చుకోసం ప్రజల నుంచి ధనం సేకరించడం సంఘానికి ఇష్టంలేని పని. సంఘానికి కావలసిన ధనం స్వయంసేవకులనుంచే రావాలని డాక్టర్ హెడగెవార్‌జీ గురుదక్షిణ పద్ధతిని ప్రవేశపెట్టారు. ఒక ప్రాంతంలో చాలినంత గురుదక్షిణ నిర్మాణం కాని పక్షంలో, ఇతరులవద్దకు వెళ్ళి డబ్బు అడగవలసివస్తుంది. అలాచేసే కన్న - స్వయంసేవకులుగా ఉండి, సంఘంపట్ల శ్రద్ధఉన్నప్పటికీ రోజూ శాఖకు రావడం, బాధ్యత తీసుకోవడం, పని చేయడం ఎందుకని తప్పుకునే బంధువులను సంపర్కం చేయడం అవసరం అవుతుంది. అలాంటి స్వయంసేవక బంధువులు ఉన్నారని మీరూ చెపుతున్నారు. నేనూ అంగీకరిస్తున్నాను. అయితే కేవలం గురుదక్షిణకోసమే వారితో సంబంధం పెట్టుకోవడం సముచితం కాదు. మన అసలు పద్ధతి ఏమంటే - గురుదక్షిణ సమయంలో వెళ్ళిన విధంగానే, సంవత్సరంలోవచ్చే ఇతర కార్యక్రమాల సమయంలో కూడ - సంక్రాంతి ఉత్సవానికి, విజయదశమి ఉత్సవానికి, అధికారుల పర్యటనల సందర్భంలో జరిగే సమ్మేళనాలకు - వారిని పిలవాలి. వారు వచ్చేటట్లు చూడాలి. కేవలం గురుదక్షిణకోసం వెళ్ళి, సంవత్సరంలో వారి ముఖం చూడకపోవడం సరైనపద్ధతికాదు. ధన విషయంలో సంఘం స్వయంపోషకంగా ఉండాలంటే పాత స్వయంసేవకులనుకూడ

కలియవలసి ఉంటుంది. ఇక ఇతర పనులకోసం సంఘం ఖర్చుచేయడం సాధ్యం కాదు. తిరుపతిలో జరిగే విశ్వహిందూ పరిషత్ సమ్మేళనాన్ని గురుదక్షిణతో జరపలేము కదా. కాబట్టి ఆ స్వయంసేవకులను గురుదక్షిణ సమయంలోనేకాక సంవత్సరమంతా కలుస్తూ ఉండడం మంచిది. మీరు చెప్పినదానిలో కూడ కొంత నిజం ఉంది.

## పారిశ్రామికవేత్తలలో స్వయంసేవకులు మెరుగు

ప్ర. ధనవంతుల అన్యాయాలను, అవినీతినీ మనం అరికట్టలేక పోతున్నాం. స్వయం సేవకులు నడిపే విద్యాలయాలలో, ఇతర సంస్థలలో తక్కువ జీతాలు ఇస్తున్నారు. అన్యాయాలు జరుపుతున్నారు. ధనవంతులపై మనం ఆధారపడడం ఇందుకు కారణమా ?

స. ఈ అన్యాయాలు సంఘ స్వయంసేవకులు మాత్రమే చేస్తున్నారని మీరు చెపుతున్నారా? అందరు చేస్తున్నారని చెపుతున్నారా ?

ప్ర. అందరూ.

స. ఆ విషయం అంగీకరిస్తున్నాను. నేటి వాతావరణంలో ఒక ఉద్రిక్తత ఉన్నది. యజమానులు ఆ వాతావరణంలో ఒక భాగం. ఇందుకు సంఘం కారణంకాదు. సంఘానికి చెందిన పరిశ్రమల యజమానులు సంఘ వాతావరణంలో పెరిగి ఉంటారు కనుక, వారు తమ కార్మికులతో సక్రమంగా వ్యవహరించాలని, ప్రేమతోవ్యవహరించాలని, వేతనాలు సక్రమంగా ఇవ్వాలని మనం ఆశిస్తున్నాం. వారు మనలను కలిసినప్పుడు వారితో ఆ విషయం చెపుతూ ఉంటాము కూడా.

ఇతరులకన్నా సంఘ స్వయం సేవకులు ఈ విషయంలో కాస్త మెరుగుగా ఉన్నారని మన అనుభవం చెపుతోంది. స్వయం సేవకులు నడిపే పరిశ్రమలలో సమ్మెలు తక్కువ. వేతనాలు సక్రమంగా ఉంటున్నాయి. అన్యాయం జరగదు. సంఘ స్వయం సేవకులు నడిపే అనేక పరిశ్రమలను నేను స్వయంగా చూశాను. తమ పరిశ్రమలలో పనిచేసే వ్యక్తుల ఇళ్ళలో వివాహాలు జరిగినప్పుడు వీరు వారి ఇళ్ళకు వెళ్ళి ప్రెజెంటేషన్‌ను ఇస్తారు. పనివారిలో ఎవరైనా జబ్బుపడ్డారని తెలిస్తే, ఈ పారిశ్రామికవేత్తలు వారి

ఇళ్ళకు వెళ్ళి వారిని పరామర్శిస్తారు. చికిత్సకు తగు ఏర్పాటు చేస్తారు. అవసరమైతే ధన సహాయం చేస్తారు అవసరమైతే వారిని ఆస్పత్రిలో చేర్పిస్తారు. సంఘంలో ఇలాంటి పారిశ్రామికవేత్తలు ఎందరో ఉన్నారు. కనుక, ఇతరులతో పోల్చిచూస్తే సంఘానికి చెందిన పారిశ్రామికవేత్తలు మరింత ఉదారంగా వ్యవహరిస్తున్నారు. అయితే, మొత్తంమీద దేశంలోని పరిస్థితి ఎంత విచిత్రంగా ఉన్నదంటే - ఈ పని చాలా కష్టమైపోతోంది.

నేను మీకు నా అనుభవం చెపుతాను. మాకు పొలాలు ఉన్నాయి. 1973కు పూర్వం నేను ఆ పొలాల వ్యవహారాలు చూసేవాడిని. ఆ రోజుల్లో భూకామందులు ఒక పద్ధతి అనుసరించేవారు. కార్మికులకు ధాన్యం కొలిచి ఇచ్చేందుకు చిన్న కుంభం వాడేవారు. మిగతా పనులకు మామూలు కుంభం వాడేవారు. క్వింటాళ్ల పద్ధతి వచ్చిన తర్వాత నేను మా కూలీలకు క్వింటాళ్ళలో ధాన్యం ఇవ్వడం ప్రారంభించాను. గ్రామంలోని భూకామందులంతా నాతో అన్నారు - నివు చేస్తున్నది ఏమిటి? కూలీలందరినీ నీవు చెడగొడుతున్నావు నీవు క్వింటాళ్ళలో తూచి ఇస్తే, మేము ఇవ్వవలసి వస్తుంది. నేను అన్నాను-మీరు చెయ్యండి, చెయ్యకపోండి నేను మాత్రం ఇలాగే ఇస్తాను.

అంటే - ఇలాంటి సమస్యలు ఎదురౌతాయి. ఏదైనా మంచి చర్య తీసుకుంటే మిగతావారంతా - నీవు చేశావు, మేము చేయవలసివస్తుంది. మాకు సమస్య వచ్చిపడింది-అంటారు. ఇలాంటి వాతావరణం ఉంటోంది. కనుక, ఒకరిద్దరు పారిశ్రామికవేత్తలు ఇలా వ్యవహరిస్తే ఇతర పారిశ్రామిక వేత్తలు-నీవు కార్మికులకు హెచ్చు జీతాలు ఇస్తున్నావు. బోనస్ ఇస్తున్నావు. అని అంటూ బాధపడతారు.

గజియాబాద్‌లో మంచి పారిశ్రామికవేత్త ఉన్నారు. ఆయన ప్రాంత సహ సంఘచాలక్ అయినారు కూడ. ఆయన అప్పుడప్పుడు హైదరాబాద్ వస్తూ ఉండవచ్చు. ఆయన పేరు జగమోహన్‌గర్గ్ విమానాలలో వాడే వైర్ తయారు చేసే ఫ్యాక్టరీ అది. దేశంలో అలాంటి పరిశ్రమ అది ఒక్కటే. అది సహకార ఫ్యాక్టరీ అని చెప్పవచ్చు. అందరికీ చక్కని

పేతనాలు లభిస్తాయి. జబ్బుచేస్తే సహాయం అందిస్తారు. ఆ కారణంవల్ల గాజియాబాద్‌లోని పలువురు యువ పారిశ్రామికవేత్తలు ఆయనను అనుసరించారు. ఇలాంటి పారిశ్రామికవేత్తలు మనలో పలువురు ఉన్నారు. ఆంధ్రలో కూడ ఇలాంటి పారిశ్రామికవేత్తలు ఉండవచ్చు. పారిశ్రామికవేత్తలు ఇలా ఉండాలనేదే మన ప్రయత్నం. మేము అందరికీ ఆవిధంగానే చెపుతూ ఉంటాం.

## అవినీతి ఎవరు చేసినా తప్పే :

ప్ర. సంఘ స్వయం సేవకులలో కొందరు పేదవారు ఉన్నారు. వారిలో కొందరు లంచాలు తీసుకుంటూ ఉంటారు. వారిని లంచాలు తీసుకోకుండా చేయడం మంచిదా ?

స. ఈ అవినీతి మంచిది, ఆ అవినీతి చెడ్డది అని భావించకూడదు. పేదవాడు అవినీతి జరిపితే అతడు క్షమార్హుడనీ, ధనవంతుడు జరిపితే క్షమార్హుడుకాడనీ అనడం తప్పు. అవినీతిలో అలాంటి తేడాలేదు. అవినీతి ఎవరు జరిపినా తప్పే. అందువల్ల దురలవాటు ఏర్పడుతుందికదా. పేదవాడు ఉన్నాడు. అతడు ఎంత పేదవాడు? మధ్యతరగతి వారు, ఆ మధ్య తరగతిలోనే ఉన్నతస్థాయి వారు, క్రింది స్థాయివారు ఉన్నారు. ధనవంతులు ఉన్నారు. ఆఫీసులో చప్రాసీ ఉంటాడు. ఆఫీసర్‌ను కలుసుకోవాలని వెళితే అయిదు రూపాయలు ఇవ్వమంటాడు. చప్రాసీ నిరుపేద కనుక, అతడు అయిదు రూపాయలు తీసుకుంటే అది అవినీతి కాకుండా పోతుందా? ఆఫీసరు ఐదువేలు అడిగితే అది అపరాధం అవుతుందా? అలా విచక్షణ చేయడం చాలా కష్టం. అవినీతి ఏదయిన దానికి సరిహద్దులు ఉండవు. అది అలవాటవుతుంది. పేదరికంవల్లనే అవినీతికి పాల్పడతారని చెప్పలేము.

ఈ విషయంలో నా అనుభవం చెపుతాను. డిసెంబరు 24 నుండి 28 వరకు మహారాష్ట్రలో విశ్వహిందూ పరిషత్ ధర్మ సమ్మేళనం జరిగింది. తిరుపతిలో జరుగబోతున్న సమ్మేళనం వంటిది. ఆ సమ్మేళనానికి

నన్ను ఆహ్వానించడానికి దాని అధ్యక్షుడు నాగపూర్ వచ్చారు. స్టేషన్ నుంచి టాక్సీలో కార్యాలయానికి వచ్చారు. టాక్సీవాలా మీటర్ రీడింగ్ కన్న మూడు నాలుగు రూపాయలు ఎక్కువ అడిగాడు. ఎందు కివ్వాలని ఈయన ప్రశ్నించారు. ఆ టాక్సీవాలా అన్నాడు కదా- 'మేము రెండు మూడు రూపాయలు ఎక్కువ అడిగాము. అంతమాత్రానికే మీకు కోపం వచ్చింది. బోఫోర్స్‌లో కోట్ల రూపాయలు తిన్నారు. దాన్ని గురించి ఏమీ చేయరు" అని మరి ఇలాంటి ఆలోచన సరైనదేనా? విచక్షణ చేయడానికి ఇది పద్ధతి కాదు. అవినీతి ఎవరు జరిపినా ఖండించదగినదే.

## వేదవిద్య అందరికీ :

ప్ర. మన ప్రాంతంలోని కొన్ని వేద పాఠశాలలో బ్రాహ్మణులను మాత్రమే చేర్చుకుంటున్నారు. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

స. మన వేద పాఠశాలలలో అన్ని వర్గాలవారికి ప్రవేశం ఉండా లన్నదే నా అభిప్రాయం. కేరళలో మన ప్రచారక్ మాధవన్ మైత్రోచ్చర ఆంతరిక పాఠశాల అనే వేద పాఠశాలను నడుపుతున్నాడు. అందులో అన్ని వర్గాలవారికీ ప్రవేశం ఉంది. కర్ణాటకలో మరో వేద పాఠశాల ఉంది. అందులోకూడా అందరినీ చేర్చుకుంటారు. ఇలా మనం నడుపుతున్న వేద పాఠశాలలు అన్నింటిలో కులభేదం లేదు. ఇది మన దృక్పథం అక్క డక్కడ పూర్వాచార పరాయణులు ఉన్నారు. పూర్వకాలం నుంచి నడు స్తున్న వేద పాఠశాలలు కూడ ఇపుడు మారుతున్నాయి. వారి మనస్సులలో కూడ నెమ్మది నెమ్మదిగా మార్పువస్తోంది. కాలానుగుణంగా ప్రవర్తిం చాలనీ, బ్రాహ్మణుడుగా జన్మించినంత మాత్రాన వ్యక్తి బ్రాహ్మణుడు కాడనీ, "జన్మనా జాయతే శూద్రః సంస్కారాత్ ద్విజ ఉచ్యతే" అని పురాణాలు చెపుతున్నాయనీ మనం వారికి చెపుతున్నాం. సంస్కారాన్ని బట్టి, అభిరుచినిబట్టి వ్యక్తులను పాఠశాలలో చేర్చుకోవలసిందని చెపు తున్నాం. అయినా, కొన్ని పాఠశాలలలో షరతులు విధిస్తున్నారు. కాని మనం నడిపే పాఠశాలల్లో అన్నింటిలో అన్ని కులాలవారూ చేరుతున్నారు.

## ఒకోసారి ప్రతిక్రియ అవసరమే :

ప్ర. నేటి ఉదయం ప్రాంత హిందూ వాహిని ప్రముఖ్ తన నివేదికలో చెప్పినట్లు క్రైస్తవ చిహ్నాలను, శిలువలను కొండలమీద నుంచి తొలగించడం, గోడలపై వ్రాతలను చెరిపివేయడం వంటి విధ్వంసక కార్యకలాపాలు జరపడం వాంఛనీయమా? సామాన్య ప్రజల సానుభూతిని సంపాదించడంలో ఇది సాయపడదని నా అభిప్రాయం. ఎందుకంటే దానివల్ల మనకు పరమత సహనం లేదనే ప్రచారం జరుగుతుంది. ఆ కార్యకలాపాలకు బదులు మనం హిందూ సమాజంలో హిందూత్వాన్ని వ్యాప్తి చేయడానికి మన శక్తిని వినియోగించాలి.

స. మీరు చెప్పింది నిజమే. అయితే ప్రతిక్రియగా కొన్ని పనులు చేయవలసివస్తుంది. అరుదుగానే అయినా చేయవలసి వస్తుంది. వివేకానంద శిలా స్మారక సమితి చరిత్ర మీకు తెలుసా ? వివేకానంద శిలపై ఇంత పెద్ద స్మారకాన్ని నిర్మించాలనే పథకం మొదట్లో లేదు. వివేకానంద శత జయంతి వచ్చింది. వివేకానంద ఆ శిలపైకి వెళ్లారు కనుక, దానిపై ఒక ఫలకం అమర్చాలని అనుకున్నాం. స్మారకం అంత మాత్రమే. అప్పుడు దత్తాజీ డిడోల్కర్ ప్రాంత ప్రచారక్‌గా ఉన్నారు. అంతా పడవలలో ఆ శిలవద్దకు వెళ్ళారు. వివేకానంద ఇక్కడ ఇలా కూర్చున్నారు అనే వాక్యాలు గల ఫలకం అమర్చారు. మూడు నాలుగు రోజుల తర్వాత క్రైస్తవులు ఆ ఫలకాన్ని ముక్కలు చేశారు. అపుడు ఏమి చేయవలసి వచ్చింది ? మళ్ళీ ఫలకాన్ని అమర్చవలసివచ్చింది. దానికి రక్షణ ఏర్పరచవలసి వచ్చింది. వివాదం పెరిగింది. సెంట్ గ్జేవియర్ ఆ శిలపైకి వెళ్ళాడని, కనుక అది గ్జేవియర్ రాక్ అని వారు చెప్పుకోసాగారు. కన్యాకుమారి జిల్లా కన్నె మేరీ జిల్లా అని ప్రచారం చేయసాగారు. పని ప్రారంభించాము కనుక మనం ఒక బృహత్ పథకాన్ని రూపొందించవలసి వచ్చింది. వివేకానంద శిలా స్మారకం ఏర్పరచవలసివచ్చింది. దీని చరిత్రను చూసినట్లయితే - అది క్రైస్తవుల ప్రతిక్రియ వల్ల జరిగిందని తెలుస్తుంది. దీన్ని గురించి మీరేమంటారు ?

శబరిమలై సమీపంలో కూడ ఇలాగే జరిగింది. రెండు మూడు సంవత్సరాల క్రితం. శబరిమలై అంతా అడవి. అక్కడ గ్రామాలు లేవు. పేటలు లేవు. శబరిమలై యాత్రకు ప్రజలు లక్షల సంఖ్యలో వెళతారు. ఇక్కడనుంచి కూడ కొందరు వెళుతూ ఉండ వచ్చు. శబరిమలై ఎదుట దానాలు చేస్తూ ఉంటారు. దగ్గరలో మనం కూడ ఒక చర్చి నిర్మిస్తే - వేలాది ప్రజలు చర్చి ముందుగా వెళుతూ ఉంటారు. వారికి మన పుస్తకాలు ఇవ్వ వచ్చు. వారు మనకు డబ్బు కూడా ఇవ్వ వచ్చు. అలా ధనం సమకూరుతుంది - అని మిషనరీలు ఆలోచించారు. అందువల్ల శబరిమలై ఆలయ సమీపంలో వారొక చర్చి నిర్మించారు. అది తుంటరి వ్యవహారం. కనుక - సంఘం, మరి 23 సంస్థలు కలిశాయి. ప్రభుత్వానికి నోటీసు ఇచ్చాయి. బిషప్‌లకు కూడ నోటీసు ఇచ్చాయి. ఇది మీరు తీసుకున్న తుంటరి చర్య. ఇక్కడ క్రైస్తవులు లేరు. కనుక మీకు ఇక్కడ చర్చి అవసరం లేదు. మీరు ఇక్కడి నుంచి దీనిని తొలగించని పక్షంలో దీనిని పడగొడతాం - అని నోటీసు ఇచ్చారు. ఆ పని చేయవలసివచ్చింది. వారా చర్చిని అక్కడ నుంచి తొలగించారు.

ఇలా క్రైస్తవులు కావాలని శిలువలు నిర్మించే సందర్భాలలో, హిందూ ధర్మాన్ని నిందిస్తూ వ్రాసే సందర్భాలలో-అందుకు ప్రతిక్రియగా ఆయా చర్యలను వ్యతిరేకించవలసివస్తుంది. మీ విశాల హృదయాని వారు స్వప్రయోజనం కోసం వాడుకుంటారు. మీరు హిందువు కనుక ఈ మాట చెప్పారు. మీరు విశాల హృదయులు. మీకు అలాంటివి నచ్చవు. కాని క్రైస్తవులు ముస్లింలు ఎన్నడూ ఈ మాట అనరు. వారు విగ్రహారాధనకు విరోధులు విగ్రహ విధ్వంసనం మా హక్కు-అని వారంటారు. పాకిస్తాన్, బంగ్లాదేశ్ వంటి ముస్లిం రాజ్యాలు అనేకం ఉన్నాయి. ఆ రాజ్యాలలోని చట్టాలలో ఎన్నో మార్పులు వస్తున్నాయి. ముస్లిం చట్టాలలో పాకిస్తాన్‌లో ఎవరూ విడాకులు ఇవ్వడానికి వీలులేదు. ఇద్దరు స్త్రీలను వివాహం చేసుకో డానికి వీలులేదు. అందుకు ప్రభుత్వ అనుమతి అవసరం అవుతుంది. పాకిస్తాన్‌లో ఇలాంటి చట్టాలు ఉన్నప్పుడు హిందూస్తాన్‌లో ఎందుకు ఉండ

కూడదు? అని మనం ముస్లింలను అడుగుతామనుకోండి. 'ముస్లిం రాజ్యాలలో పాలకులకు ముస్లిం చట్టాన్ని మార్చే హక్కు ఉంది. కాని ఇక్కడ ముస్లింల పాలన లేదు కనుక చట్టాన్ని మార్చేందుకు వీలులేదు. ఇదీ ముస్లింలు చేసేవాదం. కనుక-మనం ఎవరితో వ్యవహరించవలసి ఉన్నదో వారు ఎలా ఆలోచిస్తున్నారో తెలుసుకోవడం అవసరం అవుతుంది. హిందువులు సాధ్యమైనంతవరకు ఇలా ఆలోచించరు. మన ఆలోచన ఇది కాదు. అయితే ప్రతిక్రియ జరపడం అవసరమైన చోట ప్రతిక్రియ జరుపుతూ ఉండవచ్చు. రోజూ జరుపుతామా? ఒక్కొకసారి అక్కడక్కడ ఏదైనా సమస్య ఏర్పడుతుంది. అపుడు అలాంటి పని చేయవలసిరావచ్చు. నేను శబరిమలై ఉదాహరణ ఇచ్చాను. వివేకానంద శిల ఉదాహరణ ఇచ్చాను. అలాంటి సందర్భాలలోనే కొంత చేయవలసి వస్తుంది.

## బి.జె.పి. పట్ల సానుభూతి సహజమే :

ప్ర. ఎన్నికల సమయంలో సంఘానికి సంబంధించిన వివిధ క్షేత్రాల వ్యక్తులు బి.జె.పి. కోసం పనిచేయవలసి వస్తోంది. మరో ప్రక్క కార్యకర్తలను తయారుచేసుకొనే యోజన బి.జె పి లో అంతగా కనిపించదు సంఘటనాత్మకమైన అదుపు బి.జె పి.లో ఉండే అవకాశం లేదా? అన్య క్షేత్రాల వ్యక్తులు బి.జె.పి. కోసం ఇలా పనిచేస్తూ పోవలసిందేనా ?

స. భారతీయ జనతా పార్టీకి కొన్ని ప్రాంతాలలో దానికి తగు బలం, పలుకుబడి లేకపోవచ్చు. కాని అనేక ప్రాంతాలలో దానికి తగు బలం, పలుకుబడి ఉన్నాయి. పత్రికలలో చూస్తే పెక్కు పత్రికలు ఆ పార్టీకి వ్యతిరేకంగా వ్రాస్తున్నాయి. అయితే, బి. జె. పి. ప్రత్యామ్నాయం కావచ్చునని ఆ పత్రికలు కూడ వ్రాస్తున్నాయి. కనుకనే - కమ్యూనిస్టులు బి.జె పి. ని వ్యతిరేకించినపుడు ఇతర పార్టీలు అందుకు అంగీకరించలేదు. బి.జె.పి. ని ఏకాకిని చేసే బదులు, కమ్యూనిస్టులే ఏకాకులు అయినారు. నేడు బి.జె.పి. కి ఆంధ్రలో తగినంత బలం, పలుకుబడి లేకపోయినా, ఇతర ప్రాంతాలలో లేవని కాదు.

ఇక బి.జె పి. పట్లా మన మనస్సులో కొద్దో గొప్పో సానుభూతి ఉండడానికి కారణం ఉంది. అసలు బి.జె.పి. ఎందుకు ఏర్పడింది? జనతా పార్టీ చీలిపోయింది ఎందువల్ల? ద్వంద్వ విధేయత కారణంగా. మధు లిమయే, ఇతరులు ఒక సమస్య లేవదీశారు. ఆర్.ఎస్.ఎస్ కు వెళుతున్న వారికి జనతా పార్టీలో స్థానం లేదని చెప్పారు. ఈ విధానాన్ని అంగీకరిం చని వారు బి.జె.పి.ని ఏర్పాటు చేసుకున్నారు. కనుక బి.జె పి. స్థాపనకు కారణం ధ్వంధ్వ విధేయత, ఆర్.ఎస్.ఎస్. కనుక-మన మనస్సులో వారి పట్ల సానుభూతి ఉంటే, అందులో తప్పేముంది? పత్రికా ప్రతినిధుల సమావేశంలో కూడ నన్నీ ప్రశ్న అడిగారు. మొన్న ఢిల్లీ రోటరీ క్లబ్‌లో ప్రసంగించాను. ఒక వ్యక్తి ఇదే ప్రశ్న అడిగాడు. అందులో తప్పేముంది? అని నేను చెప్పాను. క్షమాపణ చెప్పుకునే ధోరణిని నేను అవలంభించ బోవడం లేదు.

అయితే బి.జె.పి. తనను గురించి ఆలోచించుకోవాలి. ఆర్.ఎస్.ఎస్ బి.జె.పి. కి వెట్టి చాకిరీ దళం కాదు. ఆర్.ఎస్.ఎస్. తన కోసం పని చేస్తుందనీ, తాను తన సంస్థను నిర్మించ నవసరం లేదనీ బి జె పి. భావిస్తే-అది పొరపాటు. బి జె.పి. వారు తమ కాళ్ళమీద తాము నిలబడాలి. సమా జంలో ఎందరో ప్రజలు వారితో ఏకీభవిస్తున్నారు. వారిని అభిమానిస్తు న్నారు. వారిని వెదకి, తమ పార్టీని నిర్మాణం చేసుకోవాలి. మన సంఘంలో కూడ రాజకీయాలపై హెచ్చు అభిరుచి కలిగిన వ్యక్తులు ఉండవచ్చు. మనం వారిని ఇవ్వవచ్చు. ఏమైనా, తన సొంత బలాన్ని నిర్మించుకోవడం బి.జె పి పని. కాని-ఆర్.ఎస్.ఎస్. వారు ఉన్నారు. వారు మనకోసం పని చేస్తారు అని బి.జె.పి వారు భావిస్తే. అది సరైన దృక్పథం కాదని నేను వారికి స్పష్టంగా చెప్పాను.

ఆర్.ఎస్.ఎస్. వారు బి జె.పి. కోసం ఎప్పుడు పనిచేస్తారు? సిద్ధాంత రీత్యా వారు మనకు సన్నిహితంగా ఉన్నప్పుడు. ఇది మొదటి విషయం. రెండవది-అందులో పనిచేసే స్వయం సేవకులు సంవత్సరం పొడవునా ప్రతిచోటా ఆర్. ఎస్. ఎస్. శాఖలతో సంపర్కం పెట్టుకున్నప్పుడు.ఎన్ని

కలు వచ్చాయి, ఆర్. ఎస్.ఎస్ వారు పనిచేస్తారని అంటే, అలా ఎప్పుడూ జరగదు. అది అసహజమైన సంగతి.

కనుక - దేశంలో బి. జె. పి. ప్రత్యామ్నాయ పార్టీగా నిర్మాణం కావడం మనకు ప్రయోజనకరమైన విషయం. దేశానికి ప్రయోజనకరమైన విషయం. ఇది మన ఆలోచన అయితే, బి.జె.పి. ని నిర్మించుకోవడం మాత్రం బి.జె.పి. వారి పని. పని చేయం, శ్రమించం అంటే ప్రయోజనం లేదు. బి.జె.పి. లోకి రాగలిగిన యువకులు వేలాదిగా ఉన్నారు. బి.జె.పి. వారు వారిని కలుసుకోవాలి. తమ సిద్ధాంతంతో, తమ కార్యక్రమంతో, నిజాయితీ చిత్తశుద్ధి కలిగిన కార్యకర్తలపట్ల ఉన్న సద్భావంతో వారిని కలుసుకోవాలి. అనేక ప్రాంతాలలో బి.జె.పి. కి అవకాశం ఉన్నది. కొన్ని ప్రాంతాలలో అందుకు సమయం పట్టవచ్చు. ఆంధ్రలో సమయం పడుతుంది. కర్ణాటకలో సమయం పట్టవచ్చు. అయితే అనేక ప్రాంతాలలో ఇప్పుడు కూడ దాని స్థితి బాగుంది. ఇకముందు పెరిగే అవకాశమూ ఉంది. తన సంస్థను నిర్మించుకోవడం, బయట నుంచి కార్యకర్తలను వెదకి తెచ్చుకోవడం - ఇది బి.జె పి. పని. అలాగే, సంఘంలో రాజకీయాలలో ప్రవేశించగోరేవారు ఉంటే వారు వెళ్ళడానికి అనుమతించవచ్చు.

## హిందువు పరాక్రమించాలి :

ప్ర. దేశంలో హిందూ వాతావరణం ఉంది అని సంఘ వేదికల మీద వింటున్నాం; వార్తల ద్వారా తెలుసుకుంటున్నాం. అఖిల భారతీయ స్థాయిలో జరుగుతున్న ఉద్యమాల గురించి కూడా వింటున్నాం. ఉదాహరణకు రామ జన్మభూమి. కాని స్థానికంగా వచ్చే సమస్యల విషయంలో పరాక్రమించే ధోరణి ఇంతవరకు అనుభవంలోనికి రాలేదు. దానిపట్ల మీ అభిప్రాయం ఏమిటి?

స. అసలు హిందువు యొక్క స్వభావంలో పరాక్రమించే ప్రవృత్తి లేదు, హిందువు పిరికివాడు, ముస్లిం వేధించే లక్షణం కలవాడు-అని గాంధీజీ చెప్పారు. హిందువును 'మెత్తని హిందువు' అని ప్రపంచమంతా వర్ణిస్తోంది.

ఇది దుర్గుణం కాదు-సద్గుణమే. కాని, ఎవరితో పోరాడవలసి వస్తున్నదో అతడు ఎలాంటి వాడో తెలుసుకుని వ్యవహరించవలసి వస్తుంది. మనం మెత్తగా ఉండడం ఇతరులు పరాక్రమించడం - ఇది కొనసాగడానికి వీలు లేదు. హిందువులలో పరాక్రమించే ధోరణి లేదని మీరంటున్నారు. కాని, నాకు తెలిసినంతవరకు హైదరాబాద్‌లో ఈ మధ్య జరుగుతున్న కల్లోలాలలో హిందువు దెబ్బతిని ఊరుకునే రోజులు గతంలో ఉండేవి. కాని నేడు హైదరాబాద్ నగరంలో హిందువు కూడా పరాక్రమిస్తున్నాడని, పోరాడు తున్నాడని నేను విన్నాను. నేడు ఆంధ్ర అంతటా ఇదే వాతావరణం ఉండ వచ్చు. ఇక్కడి హిందువు అనవసరంగా పరాక్రమించవలసిన అవసరం లేదు. కాని, ఎంతవరకు పరాక్రమించాలో అంతవరకు పరాక్రమించడం మాత్రం తప్పని సరి. ఆ మేరకు పరాక్రమించకపోతే జనజాగరణ ద్వార పరాక్రమించేటట్లు చేయండి. మనం ఎంతకాలం దెబ్బతింటూ కూర్చుంటాం. ఎక్కడికి వెళితే అక్కడ దెబ్బతింటూ కూర్చోవడం సిగ్గుపడవలసిన విషయం. ఈ దేశంలో 80 శాతం హిందువులు ఉన్నారు. 60 కోట్ల మంది హిందువులున్నారు. ఇంతటి సంఖ్య ఉన్నప్పటికీ, ఏదో గ్రామంలో అల్లర్లు జరిగి, హిందువు పారిపోయాడని అక్కడ నుంచి వార్త వస్తుంది. హిందువు దెబ్బతిన్నాడని వార్త వస్తుంది. ఇది హిందువుల చరిత్ర మాత్రమే కాదు. దేశ చరిత్ర కూడా. తిరుపతి ధర్మ సమ్మేళనం యొక్క నినాదం ఏమిటి? హైందవ చైతన్యం భారత సంక్షేమం. ఇది ఒక వాస్తవం. హిందూ సమాజం చైతన్య విహీనం అయితే జాతిలో చైతన్యం ఎక్కడ నుంచి వస్తుంది? చైతన్యం అంటే అవసరమైనమేరకు పరాక్రమించడం. లేకపోతే చైతన్యం యొక్క అర్థం ఏమిటి? దేశంలోని అన్ని ప్రాంతాలలో గణనీయ మైన పరివర్తన వస్తున్నదని నేను భావిస్తున్నాను. హైదరాబాద్ విషయం విన్నాను. ఇతర పట్టణాలలో అల్లర్లు జరిగేటప్పుడు మీ అనుభవం ఎలా ఉంది? ఏమైనా - హిందువు అవసరమైన మేరకు పరాక్రమించవలసి ఉంటుంది.

